T. V. C. STORY SERIES

# NITI KATHARATNAKARAMU

## PART I

By

M. SRIPATI
Telugu Pandit L. M. Bentinck High School Madras



T. V. Chellappa Sastri & Sons.

# నీతికథారత్నాకరము.

## ప్రథమభాగము.

గ్రంథకర్త,

మంకాల శ్రీపతి.

తెనుఁగుపండితుఁడు బెంటింకుహైస్కూలు చెన్నపురి.



ప్రకాశకులు

టి. వి. చెల్లప్పశాస్త్రి అండు సన్సు,

మదరాసు.

1926

 [వెల 6 అణాలు.

# విజ్ఞప్తి.

పరమపవిత్రంబులగు నీతుల నింగ్లీషుబడులలో జదువు విద్యార్థులకు బాల్యముననే యెఱింగించుట యవశ్యకర్తవ్యము. పురాణేతిహాసప్రబంధాద్యుత్తమకావ్యములగు మూలగ్రంథములజదువుభాషాజ్ఞాన మిదానీంతనులగుమాణవులకు లేదనుట దోషముకానేరదు. విద్వాంసులు పలువు రీ విషయము నాలోచించి నిర్దుష్టములగు చిన్నివచనగ్రంథములను రచించి యాంధ్రలోకమున కొసంగుచున్నారు. నే సహితమయ్యదియ కర్జంబ యాలోచించి యీ "నీతికథారత్నాకర" రచనకుం గడంగితి. ఇందలి ప్రతికథయు నొక్కొక్కనీతిని బోధించుచుండును. వివిధసద్గ్రంథములనుండి గ్రహించి యీ నీతికథల రచియించియున్నాఁడను. సహృదయులగుభాషాభిజ్ఞులు నిందలి నెరసుల నెఱింగించినయెడల ముద్రణాంతరమున వందనపురస్సరముగా సవరించుకొనువాఁడను.

మంకాల శ్రీపతి.

# విషయసూచిక.




విషయము. పుట.

శ్రీరస్తు.

ఓం నమో భగవతే జగన్నాటకసూత్రధారాయ.

# నీతికథారత్నాకరము.

## 1. వినాయకుఁడు.

పూర్వకాలమున దేవతలకును రాక్షసులకును యుద్ధము జరుగుచుండెను. ఒకతడవ రాక్షసులకపజయమును వేల్పులకు జయమును గలిగెను. అప్పుడు దానవులకాచార్యుఁడైన శుక్రుఁడు వారిలో నొకరికి "విబుధ" అను కన్నియఁ బుట్టిన ట్లను గ్రహించెను. అట్లు పుట్టినవిబుధకు బుద్ధివచ్చినవెనుక సని వసిష్ఠవంశజాతుఁడై ఘోరతపము సలుపుచుండిన మరకతమహర్షి పాలికరుదెంచి, బహుభంగుల శృంగారచేష్టలు సలుపుచుండినది. ఆ ప్రకారమాయసురవనిత యాఋషిమ్రోలఁ దిరుగుచుండఁగా దాని తపఃఫలమో యనుతెఱంగున నాజడదారికిఁ గామవికారము కలిగె. అట్లామునివర్యుఁ డారాకాసిని వివాహమాడఁగా బలిష్ఠులగు పుత్త్రులనేకులు గజాస్యులు పుట్టిరి. వారికెల్లరకు గజాసురుఁ డనువాఁడు పెద్ద. శుక్రాచార్యులయాజ్ఞప్రకారము వాఁడు పరమశివుంగూర్చి తపస్సు చేసి యా మహాదేవువలనఁ బెక్కువరములు వడసెను.

అట్లు వానికి వరములిచ్చునప్పుడాముక్కంటి గజముఖముకల వానివలన వానికి మరణము కలుగునని యుం గూడ ననుగ్రహించినాఁడు. అటువెనుక నాగజాసురుఁడు శివునికరుణవలనఁ గలిగినబలముచే గర్వించి ప్రపంచమునఁ దన కెదురెవ్వరును లేరని చెలరేగి వేల్పులను, మునులను, హింసచేయ మొదలిడి యింద్రలోకము సయితము తనయధీనముచేసికొనెను. అట్లు వానివలనిబాధల కోర్వఁజాలక దేవతలు వీనిం జంపనుపాయముఁ జూప బ్రహ్మను వేఁడఁగా నాసలువ వారి దోడ్కొని శివునికడకుఁ జని వానిఁ దుదముట్టింప వెరవు వేఁడెను.

గజాననావతారము.

అట్లు వేఁడఁగా శివుఁడు వారిఁ గాపాడ నుపాయమాగసెను. పార్వతీసహితుఁడై కైలాసమునం గల చిత్రమంటపము చూచుట కనునెపమున నటకువచ్చెను. అక్కడ వ్రాయఁబడిన చిత్తరువులలోఁగల యేనుఁగుఁ బిడియేనుఁగుఁగని పార్వతి అవి యేమి అని యడుగఁగా నా మహాదేవుఁడా యేనుఁగలజంటకుఁ బ్రాణము కలుగున ట్లనుగ్రహించినాఁడు. యేనుఁగమిథునము నకు గజాస్యము కలపురుషశిశువు పుట్టెను. ఆ ప్రకారము పుట్టిన బిడ్డనుఁ బార్వతీదేవి ఎత్తి పెంచినది. అతఁడే గజాననుఁడై పార్వతికి ముద్దులకుమారుఁడు గూడనయ్యె. అతఁడు బాల్యమున బాల్యచేష్టలు చేయుటవలన దేవతలును ఋషిపత్నులును లోపలఁ బిండి పూర్ణముంచి ప్రపంచమునందలి యెల్ల వస్తుజాలములనుండు నీశ్వరుఁడాతఁడే యని తోఁచెడి

చందమున మోదకము లొనర్చి యా విఘ్నేశ్వరున కిచ్చిరి. దానివలన నాతనికి మోదకప్రియుఁ డను పేరు కలిగినది. ఆతనికిఁ గలయపరిమితశక్తిఁగని పరమశివుఁ డాతని సురగణములకు సేనాపతిగఁ జేయుటం జేసి యాయనకు గణపతి యను పేరుకూడఁ గలిగినది.

## గజముఖాసురవధ.

పరమశివుఁడు వేల్పులపిండులకు గజాస్యుని సేనాపతిగఁ జేసినాఁ డనువార్త గజాసురుఁడు విని వాని సేనాసమూహము వెంటరా నాగణపతితోఁ గయ్యమూడఁ జనుదెంచెను. అట్లు చనుదెంచిన గజాసురుతో లంబోదరుఁడుచాలఁకాలము రణ మొనర్చి యే యాయుధమువలనను, ఏ శస్త్రమువలనను వానిని మట్టుపెట్టుటకు వీలు లేమిం జేసి తన దంతములలో నొక దాని నూడఁబెఱికి దానితో వాని తొమ్ము చీల్చిచంపెను. అట్లు చచ్చి నేలమీఁదఁబడిన గజాసురుఁడు భయంకరమైన మూషిక రూపము దాల్చి లేచెను. ఆ చందమున లేచినమూషికము నుమాసుతుఁడు కేలఁదాకఁగా వానికి సద్బుద్ధి జనించినది. ఆ వెనుక వాఁడాలంబోదరునకుం దాను వాహనమైయుందునని విన్నవింపగా నాగజాననుఁడు వానివేఁడికోలునంగీకరించి వానిఁ దనకు వాహనముగాఁ జేసికొనెను. నాటంగోలె నాగణపతికి మూషికవాహనుఁ డను పేరువచ్చినది. [illegible] నామూషికము తాను గజాసురుఁడై యుండఁగా వేల్పులెల్ల నాతనికి భయంపడి రెండుచేతులు జోడించుకొని తల [illegible]

మొట్లు మొట్టుకొనుచు చెవులుపట్టుకొని, గుంజిళ్ళు పెట్టుచుం డిరి. ఆ ప్రకారము పూర్వమువారు తనకు గుంజిళ్లు పెట్టిన తెఱఁగున భూలోకముననుండు ప్రజలెల్లరు తనమీఁద నెక్కి తిరుగాడుగణపతికి గుంజిళ్లు పెట్టవలయునని మూషికము కోరి నందున భూప్రజలు వినాయకునిఁ బూజించునాఁడు తల కిరు వైపుల మొట్లు మొట్టుకొని చెవులుపట్టుకొని గుంజిళ్లు పెట్టు చున్నారు.

వినాయకవ్రతము.

ఆ దేవదేవుఁడు జన్మించిన దినము భాద్రపదశుద్ధ చతు ర్థశియగుటవలన నాఁడావేల్పునకు హిందూదేశమున నుండు జనులలోఁ బెక్కండ్రు బహుభక్తియుక్తులై పుట్టమన్ను తెచ్చి దానితో వినాయకమూర్తిఁ గావించి దానికిఁ బ్రాణప్రతిష్ఠ సలిపి యానెనుక షోడశోపచారము లొనర్చి యర్చించి యా యన యనుగ్రహమునకుఁ బాత్రులగుచున్నారు. పెద్దలు ప్రతిదినమునఁబడకనుండి లేచుచు నిట్లు గణాష్టకము బఠించు చుందురు.

యంబ్రహ్మవేదాంతవిదోవదంతి
పరంప్రధానం పురుషం తథాన్యే
విశ్వోద్గతేః కారణ మీశ్వరంవా
తస్మైనమో విఘ్నవినాయకాయ. ౧
ఏకదంతం మహాకాయం తప్తకాంచనసన్నిభమ్
లంబోదరం విశాలాక్షం వందేహం గణనాయకమ్. ౨

మౌంజీకృష్ణాజినధరం నాగయజ్ఞోపవీతినమ్
బాలేందుశకలామౌళిం వందేహం గణనాయకమ్. 3
"చిత్రరత్నవిచిత్రాంగం చిత్రమాలావిభూషితం
కామరూపధరం దేవం వందేహం గణనాయకమ్. ౪
మూషికోత్తమ మారుహ్య దేవాసురమహాహవే
యోద్ధుకామం మహావీర్యం వందేహం గణనాయకమ్. ౫
గజవక్త్రం సురశ్రేష్ఠం కర్ణచామర భూషితమ్
పాశాంకుశధరం దేవం వందేహం గణనాయకమ్. ౬
యక్షరాక్షసగంధర్వసిద్ధవిద్యాధరై స్సదా
స్తూయమానం మహాబాహుం వందేహం గణనాయకమ్. ౭
అంబికాహృదయానందం మాతృభిః పరివేష్టితం
భక్తప్రియముదోన్మత్తం వందేహం గణనాయకమ్. ౮
సర్వవిఘ్నకరం దేవం సర్వవిఘ్నవివర్జితం
సర్వసిద్ధిప్రదాతారం వందేహం గణనాయకమ్. ౯
ఏక మౌంజీ చిత్రరత్న మూషికో గజవక్త్రకః
యక్షాంబికా సర్వవిఘ్న గణాష్టక మిదం క్రమాత్. ౧౦
గణాష్టక మిదంపుణ్యం యఃపఠే త్సతతం నరః
సిద్ధ్యంతి సర్వకార్యాణి విద్యావాన్ధనవా న్భవేత్. ౧౧
మూషికవాహన మోదుగహస్త
చామరకర్ణ విలంబితసూత్ర
వామనరూప మహేశ్వరపుత్ర
సిద్ధివినాయక పాదనమస్తే. ౧౨

గజాననం భూతగణాధిసేవితం
కపిత్థజంబూఫలసారభక్షితం
ఉమాసుతం శోకవినాశకారణం
నమామి విఘ్నేశ్వరపాదపంకజమ్. ౧౩

హిందువులలో పెక్కండ్రు ఈ వినాయక వ్రతమనుష్ఠించుచున్నారు. అదియుంగాక హిందువులేకర్మమునలిపినను, ప్రతికర్మారంభమున నాకర్మము నిర్విఘ్నముగను జయప్రదముగను ముగియుటకొఱకు విఘ్నేశ్వరపూజ సలుపుచున్నారు.

వినాయకునింగూర్చి పెక్కండ్రు పెక్కు తెఱంగుల వాక్రుచ్చుచుందురు. వినాయకుడు నిత్యబ్రహ్మచారి యని కొందఱు పల్కుచుందురు. రెండియుం గొందఱు విఘ్నేశ్వరునకు ధర్మపత్నులు [illegible] గలదని [illegible] వినాయకుడు, విఘ్నేశ్వరుడు, పిళ్లారి మొదలగునవి [illegible] నామములు, [illegible]

[illegible]

[illegible]

## 2. దేవుడే లోకరక్షకుడు.

రత్నగర్భ యనునొక గ్రామము గలదు. అందొకముసలిది నివసించుచుండెను. దానియింటిలో నొకకుంపటియు నొక కోడియు నుండెను. ప్రతిదినము తెల్లవాఱుజామున నీకోడి కూయఁగానే యా యూరి [illegible] నిదురమేల్కొని లేచి యా ముసలిదానియింటి కరుదెంచి నిప్పుతీసుకవెళ్లి తమతమ

కృత్యము లాచరించుకొనుచుండిరి. ఇట్లు చిరకాలముజరుగు చుంటచే ముసలమ్మను నా యూరివారందఱు బహుభంగుల ప్రశంసించుచుండిరి.

"నాకోడి ప్రతిదినముకూయుచుంటవలననే తెల్లవారు చున్నది. నా యింట నిప్పుడుంచుటవలననే యీ యూరివా రందఱు రోజు తీసుకపోయి వంటలువండుకొని భుజించి జీవిం చుట కవకాశముకలుగుచున్నది. నే నీ యూరినివదలి యెట కేని వెళ్లెద. అప్పుడెట్లు తెల్లవారుచున్నదో. ఈ యూరివా రెట్లుభుజించి ప్రాణములుపెట్టుకొనియుండెదరో చూచెదను". అని యిట్లాలోచించుకొని యొకనాఁడా ముసలిది యర్ధరాత్రి మున లేచి యెవరితోను జెప్పకుండ కోడిని కుంపటిని తీసికొని యా యూరికి బహుదూరమునను్న యడవి కేగి యొకవృక్ష చ్ఛాయ విశ్రమించియుండెను.

తెల్లవారెను. ఉదయమున నెప్పటియట్ల యూరివా రందఱు ని ముసలిదానియింటి కగ్నికై యరుదెంచిరి. ఆమె యింటలేనందున యెక్కడికేగెనో యేమో అని యనుకొనుచు మఱియొకవిధముగా నిప్పుసంపాదించుకొని తమతమకర్జంబు లను సక్రమముగాఁ జేసికొనిరి. అట వనమందున్న ముసలిది సూర్యాస్తమయమగు పర్యంత ముపవాసముకూర్చుండి యుం డెను. ఆ సమయమునఁ దనయూరివాఁడొకఁడు కార్యార్థియై యా మార్గమునఁ బోవుచుండెను. అతనిం జేరఁబిలిచి మన ముసలమ్మ "నాయనా! మీ యూరిలో నీ ప్రొద్దు నేను లేను

గదా! అక్కడ తెల్లవారినదా? ప్రొద్దాగికినదా? మీరం దఱు భోజనముచేసితిరా?" అనియడిగెను. అందుల కతఁడు మందస్మితుఁడై "ఓసిపెట్టిదానా! ఈ ప్రపంచమంతయు నీకోడి కుంపటులవల్లనా యున్నది? లోకరక్షకుఁడు దేవుఁడుగాని మనుష్యులు కాఁజాలరు. నీ వెందుల కిట యజ్ఞానముగలిగి యుపవాసముకూర్చుండియున్నావు? లేచి నీ యింటికిఁబొమ్ము" అన నామె మిక్కిలి సిగ్గుపడి స్వగృహాభిముఖియయ్యెను. అప్ప టినుంచి యా యూరివారందఱు తనవల్లనే జీవించెదరను దుర భిమానమువదలి యామె సుఖముగానుండెను.

సర్వమును రక్షించువాఁడు దేవుఁడు. ఇట్లుండ బుద్ధి హీనులయిన మనుజులు కొందఱు తమవల్లనే సర్వము రక్షిత మవుచున్నదనియుఁ దమకంటె నన్యములేదనియుఁ దలఁచు కొనెదరు.



## 3. బుద్ధిఃకర్మానుసారిణీ.

వసుమతి యనునొకపురవరము గలదు. అందొకవర్తకుఁ డుండెను. ఆయన మిక్కిలి ధనవంతుఁడు. ఒకప్పుడాతనికి శరీర మున నొకగొప్పవ్యాధి యంకురించెను. వైద్యులనేకవిధముల నౌషధములిచ్చియు నాతఁడు నానాటికి కృశించుచుండెను. వ్యాధిబాధను దాళుటకుశక్తిలేక ప్రాణముపోవునేమో యని

భయపడుచున్నయీవర్తకునిఁజూచుటకొక స్నేహితుఁడు వచ్చుచుండెను. ఆ స్నేహితుఁడు నిజముగా వర్తకుని క్షేమమును గోరువాఁడు. కాని యతఁడు చెవిటివాఁడు. దేహస్థితిని విచారించుటకనియే యాతఁడు వచ్చుచుండెను.

మార్గమధ్యమున నతఁడిట్లాలోచించెను. నేను చెవిటివాఁడను. ఎంతో బిగ్గరగా మాటలాడినగాని నాకుఁ జెవులు వినఁబడవు. రోగపీడితుఁడగుటచే మిత్రుఁడు బిగ్గరగా మాటలాడలేఁడు. అందువలన నతనితో మాటలాడవలసినరీతిని ముందుగానే యాలోచించుకొనెదను. అతనింజూడఁగానే దండముపెట్టెదను. తరువాత ఓయీ నీ శరీరస్థితియెట్లున్నదని యడిగెదను. అందులకాతఁడు కొంచెముతిన్నగా నున్నదని చెప్పును. నేను సంతోషమనెదను. అటుతరువాత నీవు ఔషధముపుచ్చుకొనుచున్నావు గదా! అందులకేమిపథ్యము? అని యడిగెదను. చప్పిడిపథ్యమని యతఁడు బదులుచెప్పును. అందువల్ల నీకారోగ్యమగునుగాక. అనిచెప్పి నీ కౌషధమిచ్చు వైద్యుఁ డెవఁడనియడిగెదను. ఫలానివాఁడని యతఁడు చెప్పును. ఆ వైద్యుఁడె దైవసహాయమువల్ల నీ రోగముకుదుర్చుఁగాక. అనిచెప్పి సెలవుపుచ్చుకొని మళ్లీ యింటికేగెదను.

ఈ ప్రకార మతఁడాలోచించుకొని యావర్తకునింటికేగి యతనికి దండముపెట్టి దగ్గరకూర్చుండి మిత్రుఁడా! నీ శరీరస్థితి యేలాగున్నదని యడిగెను. జ్వరముచే బహుశ్రమపడుచున్నానని ఆ వర్తకుఁడుచెప్పెను. ఈ మాటలు మన

చెవిటిబాబునకు వినఁబడలేదు. తాను మునుపు యోచనచేసి కొన్నప్రకారమే యతఁడు మాటలాడుచున్నాఁడని భావించి —సంతోషము! దేవుఁడునిన్నాలాగేయుంచునుగాక!—అని చెప్పెను. రోగముచే నాయాసపడుచున్న వర్తకుఁ డీ మాటలు విని లోలోన మిక్కిలి కోపగించుకొనెను. మరల మనమిత్రుఁడు నీవేమియౌషధము పుచ్చుకొనుచున్నాఁడవు? అందులకు పథ్యమేమి? అని యడిగెను. విసిగియున్నవర్తకుఁడు ఏమో నేలమన్ను. పామ్ము. అనిగొణిగెను. చెవిటివాని కయ్యది తెలియక తానను కొన్నట్లే యతఁడు బదులుపలుకుచున్నాఁడని యూహించి—అందువల్లనే నీ రోగము శాంతించునుగాక! అనిచెప్పి నీకు ఔషధమిచ్చువైద్యుఁ డెవఁడనియడిగెను. మునుపటికంటె కుపితుఁడై యుండువర్తకుఁడు యముఁడే నాకు వైద్యుఁడనెను.—అతఁడు చేసేచికిత్సలకు దేవుఁడు సహితము సహాయుఁడౌనుగాక.—అనిచెప్పి చెవిటివాఁ డింటికివెళ్లెను. వర్తకుఁడు శోకక్రోధభయాక్రాంతహృదయుఁడయ్యెను. తన గ్రహచారమే చెవిటివానితో నట్టి సంభాషణముగావించినదని భావించెను.

మనము చెవిటివారితో బిగ్గరగా మాటలాడవలయును. లేనియెడల వైపరీత్యముసిద్ధించును. చెవిటివారు సద్విషయములంగూర్చి సాధ్యమైనంతవఱకు సంభాషించుట మానుకో వలయును.



# 4. కృతజ్ఞత.

అనంతపురమను నొకనగరవరము గలదు. కుంతీభోజుఁడనురాజు దానినేలుచుండెను. ఒకనాఁడతఁడు మంత్రి పురోహిత శ్రేష్ఠజనసమేతుఁడై సభామధ్యమున సింహాసనాసీనుఁడై యుండెను. అప్పుడొక క్షత్రియుఁడు సాయుధపాణియై యటకరుదెంచి రాజునకునమస్కరించి ఓ మహారాజా! నేను ధనుర్విద్యలో బహుపరిశ్రమముచేసినవాఁడను. జీవనాధారమేదియులేక మిక్కిలి కష్టపడుచున్నాను. నాకొకయుద్యోగమిచ్చెదరనునూహతోఁ దమసముఖమున కేతెంచినాడను. అని విన్నవించెను. రాజు సదయహృదయుఁడై నెలకు రెండువందల రూపాయలు వేతనముచేసి యతనినిఁ దనయొద్ద నుంచుకొనెను. అదిమొదలు ఆక్షత్రియశిఖామణి రాత్రిపగలు రాజునగరినిఁ గనిపెట్టుకొని జాగరూకుఁడై భయభక్తులతో నియుక్తకార్యములను సక్రమముగాఁ జేయుచుండెను. చిరకాలమునుండి సేవించుచున్న తమకంత హెచ్చువేతనమీయక నవీనసేవకుని కిచ్చిన రాజుపై యాగ్రహపడి యద్దానిం బైకిఁగనపఱచక కష్టసాధ్యకార్యములు కలిగినప్పుడెల్ల పాతసేవకులు దవుదవ్వులఁ దొలఁగిపోవుచుండిరి. నవీనాగంతుకుఁడుమాత్ర మేమరక యందఱికర్జంబులను దానే నిర్వర్తింపుచుండెను. రాజును సర్వమును న్యాయముగాఁ బరిశీలించి యెఱుంగుచుండెను.

ఒకనాటిరాత్రి నిశీధవేళ రాజు మేడమీఁదపరుండియుండ నొకస్త్రీ యేడ్చుచుండునట్లు ధ్వని వినిలేచి నవీనక్షత్రియసేవకుని బిలిచి "నేనొకరోదనధ్వనివిన్నాను. అది యే"మనియడిగెను. అయ్యా నేనుసహిత మీధ్వనివిన్నప్పటినుంచి వినుచున్నాను. కాని అదియేమో తెలియలేను. తమరాజ్ఞాపించిన యెడల నేనేగి యాసంగతి నెఱింగివచ్చెదనని యాతఁడు బదులు పలికెను. మంచిది. వెళ్లి యెఱింగిరమ్ము. అనిచెప్పియతనిఁ బంపి యతఁడెక్కడికిఁబోవునో యేమిచేయునో చూతమని గొంగడికప్పుకొని యతనికిఁ దెలియకుండ నతనివెంబడించి రాజు సహితము నిర్గమించెను. క్షత్రియసేవకుఁడు రోదనధ్వనివచ్చుచాయనేగి పట్టణమునకు వెలుపల నొకస్త్రీ తలవిరియఁబోసికొని యొకదుర్గగుడిదగ్గరకు కూర్చుండి యేడ్చుచుంటఁజూచి నీ వెవరవు? ఎందులకేడ్చుచున్నావు? అని యడిగెను.

బాబూ! నేను కుంతిభోజునిరాజ్యలక్ష్మిని. రాజింకా మూఁడుదినములలో మృతిబొందును. తరువాత నే నెవరి వద్దకుఁబోవుదును? నన్నెవరురక్షించువారు? అని యేడ్చుచున్నానని యామెచెప్పెను. అగుఁగాక. అయినను ఆ రాజును బ్రతికించుట కేమైన నుపాయముకలదా? అని యాక్షత్రియుఁడడిగెను. నీ కుమారుని ఈ దుర్గకు బలియిచ్చినయెడల ఈ రాజింకను బహుదినములు బ్రతికియుండునని, యాస్త్రీ బదులు చెప్పి తిరోహితయయ్యెను. అదివిని యతఁడింటికివెళ్లి తన భార్యాపుత్త్రులకు జరిగినవృత్తాంతమంతయుఁ జెప్పెను. కుమా

రుఁడు తండ్రినిఁజూచి తండ్రీ యిప్పుడు నా జన్మము సఫల మయ్యెను. ఎందుకనఁగా నా యీ శరీరము పరోపకారార్థము వినియోగింపఁబడుచున్నది. నన్నుఁజంపి రాజును రక్షింపుము. అతఁడు బ్రతికియున్నయెడల బహుజనులు సుఖింతురు. "పరోపకారార్థమిదం శరీర" మని పెద్దలు చెప్పిరి.

అని కుమారుఁడు సంతుష్టాంతరంగుఁడై పలికెను. తన ముద్దులపట్టియొక్క సద్గుణగణంబులకు పరమానందభరితుఁడై దుర్గగుడికిఁ బిలుచుకొనిపోయి ఖడ్గ మొరనుండిదూసి "లోకమాతా! భగవతి! యిదిగో నాకుమారుని నీకు బలియిచ్చుచున్నాను. మా రాజును చిరకాలము బ్రతికింపుము. కావలసినచో నాశిరముసహిత మొసంగెదను." అని యా వీరవరేణ్యుఁడు తనతనయునితలను నఱకఁబోయెను. అప్పుడాదుర్గ ప్రత్యక్షమై బాబూ నీసాహసమునకును ప్రభుభక్తికిని మెచ్చితిని కుమారునిఁ జంపవద్దు. నీ యిష్టానుసారముగా రాజు చిరకాలము జీవించి రాజ్యమేలుచుండును. మీ రందఱు సుఖముగానుండుఁడని దీవించి కోరినవరములొసంగి యదృశ్యయయ్యెను. మనరాజసేవకుఁడును కుమారుని స్వగృహమున కనిపి సంతసించుచు రాజనగరికిఁ బోయెను. ఇవియన్నియు నదృశ్యుఁడై చూచుచుండినరాజు ఇతనికిబూర్వమే వెళ్లి తన స్థానముననుండెను. అప్పుడు సేవకుఁడు రాజునుసమీపించి స్వామీ! యెవతోయొకస్త్రీ తనపెనిమిటితోఁబోట్లాడి వచ్చి

రాజా! శత్రువులుముట్టడించినందువలన మనకేమియు భయములేదు. ఈ రాజ్యభారమువహించుట మిక్కిలికష్టము. ఎట్లు రాజ్యమును సంరక్షించుట? ఎట్లు ప్రజలనుగాపాడుట? ఎట్లాత్మసంరక్షణముగావించుకొనుట? ఎట్లందఱికిఁ బ్రీతిగలిగించుటయును నంశములు సర్వదా హృదయకుహరముల నుండి మనలను బాధించెడిని. అన్నముతినుట కవకాశము లేదు. నెమ్మదిగా నిదురించు భాగ్యము లేదు. అబ్బబ్బా! ఈ పాడుపని యెప్పుడుతొలఁగిపోవును? ఎప్పుడు మనము సుఖించుట? అనివిచారించుచుండ దైవాధీనముగా శత్రువులే వచ్చి మనల నాక్రమించిరి. ఈ పాడురాజ్యభారదుఃఖమును వారే యనుభవించెదరుగాక. నీవు నాతోఁగూడ రమ్ము. ఈ పట్టణములో రెండువందలయిండ్లలోని బట్టలుతికి జీవించుచుండెడివాఁడను. మంత్రిత్వమువచ్చినయనంతర మా యుద్యోగము వదలినాఁడను. ఇప్పుడేగి వానిని మరల సంపాదించఁగలశక్తి నాకుఁ గలదు. నేఁజెప్పినట్లు చేయుచుండుము. అచిరకాలముననే చాకలిపని నీకు నేర్పెదను. నీవును గొన్నియిండ్లు సంపాదించుకొని బట్టలుదికి వచ్చుధనముతో జీవింపవచ్చును. లోకములో చాకలిపనికంటె శ్రేష్ఠమయిన యుద్యోగము లేదు. ఈ సంగతియంతయు నామనస్సున దృఢముగా నెలకొనియుంటచే యుద్ధమునిమిత్తము నేనేమియు సిద్ధపఱచలేదు. త్వరగారమ్ము. నాకు భయముగా నున్నది. నీవువచ్చినను రాకపోయినను నేనుమాత్ర మిఁక క్షణమైన నిచట నిలువనని

చెప్పి చాకలిమంత్రి వెడలిపోయెను. రాజున కప్పుడేదియుఁ దోచలేదు. తానొక గొప్పనేరముచేసిన ట్లప్పుడే యెఱింగెను. "జాతియంతబుద్ధి మనుష్యులకుండు"నను పెద్దలవచన మెఱింగియుండియు నీచజాతిసంజాతునిఁ జేరఁదీసి యంత యాపదఁదెచ్చుకొన్న స్వయంకృతాపరాధమునకై తన్నుఁ దాను నిందించుకొనెను. స్వయముగాఁ బరికించియైన కొంత ప్రయత్నింతమని యిటునటు చూచెను. తనసైనికులలో నొక్కడైన నచటలేడు. ఏమిచేయుటకును దోచక యాయుధ శాలకు వెళ్లెను. ఇంతలో శత్రుభటులువచ్చి రాజును బట్టుకొనిరి.. రాజ్యముపోయెను. ఇఁక ప్రాణముసహితము పోవునని నిశ్చయించి శోకక్రోధభయసంభ్రమాక్రాంతహృదయుఁడై రాజు "హా! వృద్ధమంత్రీ! నిన్ను వెడలఁగొట్టిన, పాపఫల మిట్లయ్యె"నని విచారించుచు మూర్ఛిల్లెను.

బృందావన మనునొకయరణ్య మానగరసమీపమున నుండెను. అందలి వివిధ వృక్ష లతా నికుంజపుంజములందలి పుష్పఫలాదులు చూపరకమందానందము కలిగించుచుండెను. ఎండనుజొరనీక మహావృక్షశాఖలు నిబిడములై చల్లఁదనముగలిగించి యావనమున సంచరించు జంతుసంతానములను సంతోషపెట్టుచుండెను. ఇట్టివనమున నొకవృక్షచ్ఛాయ మనవీరవర్మమహారాజు పడియుండెను. మందమారుతము శరీరమునఁ దగులుటచే నల్లల్ల ప్రజ్ఞవచ్చిరాజు లేచికూర్చుండి నలువలంకులఁ గలయంగనుఁగొనునప్పుడు తానువెడలఁగొట్టిన

వృద్ధామాత్యుఁడు తనయెదుట చేతులుమోడ్చుకొని నిలుచుం డెను. అమాత్యవరా! నేనుజేసిన పాపమునకుఁదగిన శిక్షం బొందితి. నాయపరాధమునహించి నన్ను సంరక్షింపుమని రాజు వృద్ధమంత్రిపాదములపైఁబడి యేడ్చెను. ఆనందబాష్ప పూరితనేత్రుఁడై మంత్రి రాజునులేపి సగౌరవముగా నాదరించి దేవా! గతజలసేతుబంధనమేల? అన్నియు దైవాయత్త ములు. మానవమాత్రులచే నగుకార్య మేదియు లేదు. అందువలన నీయం దేదోషమును లేదు. ఈశ్వరేచ్ఛ యిట్లు న్నది. నీవు వెడలఁగొట్టినను నేను నిన్ను నెడబాయుదునా? నిపాదసేవచేయుచు నన్నెడఁబాయకుండిన వృద్ధసేవకుఁడను నేనే! శత్రువు లొకవేళ నిన్ను జంపివేయుదురన్నభయముచే తంత్రముగా నిన్నిటకుఁ దెచ్చినాఁడను.

వీరిట్లుసంభాషించుచుండ నగరమునుండి భేరీశంఖాది నాదంబులు దిశలునిండ చతురంగబలసైన్యములును పురో హితాదివిద్వజ్జనంబులును గౌరవనీయులగు నాగరికులును నొక నవరత్నఖచితమైన పల్లకిని ముందిడుకొని రాజుకడ కరుదెంచిరి. వచ్చి రాజును మంత్రినిఁ జూచి సాష్టాంగదండప్రణామము లాచరించి నగరమునకు దయసేయుఁడు. మమ్మిక యథా ప్రకారముగాఁ బరిపాలింపుఁడని ప్రార్థించిరి. ఆశ్చర్యరసని మగ్నుఁడై రాజు పల్లకినెక్కెను. అందఱు నానందముతో నగరుప్రవేశించిరి. నగరమంతయు నలంకరింపఁబడియుండెను. తనతోఁగూడ ముకుళితహస్తుఁడై యరుదెంచు వృద్ధమంత్రినిఁ

జూచి "మంత్రివరా! ఇదేమియాశ్చర్యము! క్షణమునకు ముందు మనసర్వస్వమును శత్రువులాక్రమించికొని నన్ను బంధించిరి. నీయనుగ్రహమున నేను విముక్తుఁడనై వనముం జొచ్చితి. ఆ శత్రువులేమైరి? మనకెట్లు రాజ్యము చేకూరెను? అని యడిగెను.

దేవా! అల్పుని మంత్రిగాఁజేసినప్పటినుండి నిన్ను మాఱువేషముతో సేవించుచుండి జరుగువృత్తాంతముల నెప్పటికప్పు డెఱుంగుచుంటిని. శత్రువులు మనదుర్గమును ముట్టడించినతర్వాత మీకుఁగలిగిన పరాభవమునెఱింగి మన స్నేహితుఁడను కరుణాకరవర్మకుఁ దమ పేర నొకయుత్తరము వ్రాసి తోడుపడుమనియడిగితి. అతఁడు వచ్చునంతలో శత్రువులు నగరుప్రవేశించి మిమ్ము పట్టుకొనిరి. ఇంతలో కరుణాకరవర్మ చతురంగబలసమేతుఁడై రాఁగా మరల మనరాజ్యము లభించుననియూహించి తంత్రముగా శత్రువుల నేమరించి తమ్ము వనమునకుం గొనిపోయితి. అట్లే శత్రుసైన్యమునకును మనమిత్రసైన్యమునకును యుద్ధముజరిగినది. శత్రువుల నవ లీలగా నోడించి మనమిత్రుఁడు కార్యసంరంభముచే స్వనగరమునకు నిర్గమించెను. మనకును రాజ్యము లభించెను. అని విన్నవించిన మంత్రియొక్క ప్రభుభక్తికిని, బుద్ధికుశలతకును మెచ్చుకొని యప్పటినుంచి యారాజు మంత్రిబుద్ధినాలకించుచు పాత్రమునకుఁదగిన ట్లుద్యోగముల నొసంగుచు బుద్ధిమంతుఁడై రాజ్యముచేయుచు సుఖముగానుండెను.

నీచులసహవాసముచే నాపదసంభవించును. యోగ్యత తెలియక మనుష్యులకుఁ బనియియ్యరాదు. జాతియంతబుద్ధి, కులమంతయాచారము జనులకుండునను నీతులీ కథవలనఁ దెలియుచున్నవి.



## 6. సంసర్గజా దోషగుణా భవంతి. 1

మనుష్యులకు సహవాసముచేతనే గుణదోషములు కలుగుచున్నవి. సద్గుణముగలవారిసంపర్కముచే సద్గుణము కలుగును. దుర్గుణముగలవారిసంపర్కముచే దుర్గుణము వాటిల్లును. "దోషగుణాః=దోషములును, గుణములును, సంసర్గజాః=సహవాసమువలనఁబుట్టినవి, భవంతి=అగుచున్న" వని పైశబ్దార్థము.

ఆంధ్రదేశమున గన్నవరమని యొకగ్రామముగలదు. అందనేకబ్రాహ్మణులు మిక్కిలిధనికులై యుండిరి. కాని వారిలో దేవశర్మయనునాతఁడు మాత్రము మహాదరిద్రుఁడు. ప్రతిదినము నతఁడిల్లిల్లుపోయి యుపాదానమెత్తికొని యందువల్ల కాలక్షేపముచేయుచుండెను. ఒకనాఁడాతఁ డాయూరికి సమీపమందలి యడవికి సమిధలనిమిత్తమువెళ్ళి వానిని సంగ్రహించుకొని వచ్చుచుండెను. మార్గమధ్యమున నొకవిశాల వటవృక్షము సూర్యునికిరణములంజొరనీక చల్లనినీడకలిగిం

చుచు కనులపంఘునై యుండెను. దారినడిచినబడలికలు నీగ నించుకసేపిటవిశ్రమించి మఱిపోయెదనని భావించి యాబ్రా హ్మణుఁ డచటవిశ్రమించెను.

అదేవటవృక్షచ్ఛాయ నొకనైపున నొకపులి పరుండి యుండెను. దానింజూచి పారుఁడులికిపడిలేచి వడవడవడఁ కుచు అబ్బబ్బా! పెద్దపులివాతఁబడితిఁగా! ఇఁక నన్ను రక్షిం చువారెవరు? ఏమిచేయుదు నెందుఁజొత్తు నని తహతహ పడుచు నెటజనుటకుందోఁచక నిలుచుకొనియుండెను. అప్పుడా పులియొద్ద రెండుమూఁడు జింకలుండెను. అవి యాబ్రాహ్మ ణునిఁజూచి "యాతఁడిక్కడికిఁ దెలియకవచ్చినాఁడు. ఈతని పులిచూచినయెడల చంపివేయును. కావున మనము ముందుగా జాగ్రత్తపడి యీతనిప్రాణములను సంరక్షింపవలయును." అనియోచించి పులినిఁజూచి "ఓ వ్యాఘ్రసార్వభౌమా! నీవు ధర్మాత్ముఁడవు. నీకీర్తి దిగంతవిశ్రాంతము. అందువల్లనె యొకబ్రాహ్మణుఁడు నీదర్శననిమిత్తమువచ్చి కనిపెట్టుకొనియు న్నాఁడు." అనిచెప్పినవి. అంతమాత్రము తన్నుస్తుతించినం దుల కాపులి యుప్పొంగి మంచిది. వాని నిటకుం దోడితెండని పలికెను. అట్లే యాజింకలు బ్రాహ్మణునియొద్దకువచ్చి యతని భయముందీర్చి జరిగినవృత్తాంతమంతయుఁజెప్పి పులివద్దకుఁ దోడుకొనిపోయినవి. పులియు బ్రాహ్మణుని భయభక్తులతోఁ బూజించి యాతిథేయసత్కారములంగావించి తానదివఱకుఁ జంపినమనుష్యులసొమ్ములలోఁ జాలవఱ కతనికి బహుమాన

మొసంగి పంపెను. బ్రాహ్మణుఁ డమితానందముతోఁ దన నివాసమునకుం జని యాసొమ్ములనమ్మి ధనికుఁడై సుఖముగా కాలముగడుపుకొనుచుండెను.

ఆ బ్రాహ్మణునియింటిప్రక్కన మఱియొక బ్రాహ్మణుఁడుండెను. అతఁ డీతనికి ధనములభించినవృత్తాంత మెఱింగి తానుసహితమీవిధముగా ధనముసంపాదించవలయు నను నాశతో నాయరణ్యమునకు వెళ్లెను. ఆదినము పులియొద్ద నక్కలు కుక్కలు ఎలుఁగుబంట్లు తోడేళ్లుండెను. అవి యీ బ్రాహ్మణునిఁ జూచి "పులితోఁజెప్పి వీనినిఁ జంపించినయెడల మనకందఱికి మంచియాహారము లభించు"నని యాలోచించి "ఓ పులిరాజా! ఒకదుష్టబ్రాహ్మణుఁ డిటవచ్చియున్నాఁడు. నీ పరాక్రమము వానికిఁ దెలిసియు వాడిటవచ్చియుంటచూడగా నది మీకొక గొప్పయపకీర్తిదక్క వేఱుకాదు. సత్వరలో వానిఁజంపి మీకసితీర్చుకొనుఁడు. గోరంతశత్రునైనను గొండంటనఱుకవలయు ననిపెద్దలందురు" అనినవి. అంత నావ్యాఘ్రము భూనభోంతరములుబూరటిల్ల గర్జించి చివాలునలేచి యా బ్రాహ్మణునిమీదఁబడి పట్టుకొని చంపి వానినెత్తురెల్ల గుటగుటం ద్రావి విశ్రమించెను. తక్కినవి వానియితరావయవములను నిశ్శేషముగా భక్షించెను.

# 7. సంసర్గజా దోషగుణా భవంతి. 2

విప్రపురియను నొకయగ్రహారము కలదు. అందు దేవదత్తుఁడనునొక విప్రకుమారుండు కలఁడు. అతఁడు బాల్యముననే సర్వశాస్త్రములను సంపూర్ణముగాఁజదివి సకలకలాభిజ్ఞుఁడయ్యెను. సద్గుణమణులకాకరంబై జ్ఞానసంపన్నుండై యుంటచే బుద్బుదప్రాయంబగు నిజగజ్జాలమును క్షణికముగా నాలోకించుచుండును. జననమరణములయందు జనకోటులు తుల్యములనియు జీవితకాలములోని జాత్యాదిభేదములు మనుష్యకృతములనియు నతఁడు బాగుగాఁ దెలిసికొనియుండెను. అందుచే నతఁడు సర్వదా కరుణారసపూరితహృదయుఁడయి కఠినవాక్యము నించుకయైనను బలుకకుండెను. నగరవాసులు పంచమహాపాతకము లాచరించువారనియు నరిషడ్వర్గములను జయించినమహాత్ములు లోకమున నరుదుగానుందురనియు నెఱింగినవాఁడగుటచే నిరంతర మతనికరణ్యమున నుండుట కెక్కువ మక్కువ. వృక్షమూలము లాశ్రయించి మాటిమాటికి నిమీలితనేత్రుఁడై యతఁడు సంతోషమున మునిఁగియుండును.

ఒకనాడాతఁడు తనయూరికిసమీపమందలి యొకవనమునకేగి బహుదూరమునడిచి యడవినడుమనుండు నొక వటవృక్షముక్రింద భూమిపై పవ్వళించియుండెను. అంతట నావృక్షశాఖయందలి యొకచిలుక "అరే! ఛాంఛోత్.

యోగ్యతవుంటే రావాలి. లేకపోతే పోవాలి. మీకీ మనకీ సరిపడదు. తోడమాంసం తొమ్మిదికాసులు. ముక్కుమాంసం మూడుకాసులు. పోపో. లేదులేదు. తలతరుక్కొందును.” అనియిట్లు మాటలాడుచుండెను. దేవదత్తుఁ డియ్యది యాలకించెను. ఇది తిర్యక్ జంతువుగానుండియు కటికవాఁడు సంభాషించునట్లు మాటలాడుచున్నది. దుష్టమనుష్యులసహవాసము దీని కెట్లలవడెనని యాశ్చర్యపడుచు లేచి మఱికొంతదూరము నడిచి మఱియొకవటవృక్షచ్ఛాయ పరుండెను. ఆ వృక్షమున సహిత మొక చిలుకయుండెను. అయ్యది యీ బ్రాహ్మణునిఁ జూచి “స్వామీ! దయచేయుఁడు. తమదర్శనముచే నా జన్మము పవిత్రమయ్యెను. ఈ గృహము పావనమయ్యెను. లెండు. పాదప్రక్షాళనముఁ గావించుకొని యీ ఫలముల నారగించి విశ్రమింపుఁడు.” అనిపలికెను. దేవదత్తుఁడాశ్చర్యపడి ఏమివింత! మొదటిచిలుక పచ్చితురకవానిచందమున మాటలాడెను. ఇప్పుడిది సద్బ్రాహ్మణుఁడు అతిథి నుపచరించునట్లు సాదరముగాఁ బలుకుచున్నది. అని యూహించి ఓ చిలుకా! నీచర్య నాకానందదాయకమైయున్నవి. క్షణమునకుముందే యొకచిలుక తురకవలె మాటలాడెను. తద్విరుద్ధముగా నివు నన్నుపచరించుచున్నావు. ఇందులకుఁ గారణమేమి? అని యడిగెను. అందులకాచిలుక యిట్లు చెప్పందొడంగె.

స్వామీ! మేమిద్దఱ మొకతల్లిబిడ్డలము. చిన్నపిల్లలుగానుండునపుడే మమ్ము బోయవాఁడొకఁడు పట్టుకొనిపోయి

నన్ను బ్రాహ్మణునికిని దానినొక కటికవానికిని విక్రయించెను. కొంతకాలమునకు మేమిరువురము పంజరమునుండి తప్పించుకొని వచ్చితిమి. బ్రాహ్మణునియొక్క సదాచారములు, సద్వాక్యములన్ని నాకలవడెను. కటికవానిగుణములు, మాటలు సోదరునికి పట్టుపడెను. సంసర్గదోషమే యిందులకుఁగారణము అనెను.

సజ్జనసహవాసముచే సద్గుణమును దుర్జనసహవాసముచే దుర్గుణమును గలుగునని యీకథమనకు బోధించుచున్నది.

## 8. బుద్ధిమంతులు ముఖస్తుతికోరరు.

గాంధార దేశమును సత్యవర్మ యనునొకరాజు పాలించుచుండెను. ఆయన మిక్కిలి బుద్ధిమంతుఁడు. అధికారగర్వము లేనివాఁడు. మహాపరాక్రమవంతుఁడగుటచే శత్రుభయంకరుఁడయి యుండెను. నిరంతర మతనికి ప్రజలకు ప్రియముచేయుట యందే కోరిక. ప్రతిదిన మతఁడు సభాభవనమున కరుదెంచి కనకాసనాసీనుండై ప్రజలస్థితిగతుల నాలకించి వారికష్టముల నుచితోపాయములచేఁ దొలఁగించుచుండెను. నిష్పక్షపాతముగా ప్రజలకలహముల నాలకించి న్యాయముదయచేయుచుండెను. ప్రజలందఱు రాజును వేనోళ్లఁ గొనియాడుచుండిరి.

శిష్టాచారముచొప్పున వందిమాగధులు ప్రతిదినమును రాజ గుణములను విశేషముగా గీర్తించుచుండిరి. మంత్రులు సామంతులు తక్కుంగలపరిజనులు రాజును వీక్షించినపుడెల్ల తొలఁగిచనుచు స్తుతించుచుండిరి.

ఒకనాఁడు రాజు ఏకాంతముగా నొకగృహమునఁ బరుండి యిట్లు చింతింపసాగెను. ఆహా! దైవసంఘటనము నేమన వచ్చును? పంచేంద్రియసమాయుక్తులైన నరులందఱు తుల్యులని నేఁ దలంచియున్నాఁడను. ఇట్లుండ నిపాఁడు తారతమ్యము కలుగుటకుఁ గారణ మెయ్యది? అక్కటా నేనుసహితము మనుష్యుఁడనేగదా! నేనుగూడ ఒకదినము మరణముచెందు నాఁడనే గదా! సామాన్యజనులకంటె నేనెట్లధికుఁడను? జనులను పరిపాలించుట రాజునకు విహితకృత్యమైయుండఁగా వీరేల నన్ను స్తుతించెదరు? వీరియజ్ఞానము నెట్లు తొలగింతును? అని యిట్లాలోచించుకొని యొకనాఁడు సభాసదులంజూచి మీ రింక నన్ను స్తుతింపవలదు. అని యాజ్ఞాపించెను. రాజున కేమోకోపమువచ్చినట్లున్నది. ఏమాజ్ఞ లేమనిరో అని భయ పడి సమస్తమైనవారును మునుపటికంటె నధికముగా భయప డుచు మునుపటికంటె నధికముగాఁ బొగడసాగిరి. రాజు వారిహృదయము నెఱింగి యొకనాఁడు మంత్రులంజూచి నేటి సభ సముద్రతీరమున తరంగములసమీపమున జరుగవల యును. కావున ఆసనాదులచట వైచి సంసిద్ధులరైయుండుఁడని యాజ్ఞాపించెను. వారట్లుచేసి రాజునకు విన్నవించిరి.

సముచితపరివారసమేతుఁడై రాజు సముద్రతీరమున కేగెను. తనసింహాసనమును నీటియొడ్డునవైచికొని కూర్చుండెను. మంత్రి సామంత పురోహిత దండనాథులందఱు భయపడుచు నొదిగి నిలుచుండిరి. రాజొకసేవకునిం జూచి ఓరీ! నీవీ తరంగములను దూరముగా పొండని నామాటగాఁ జెప్పుమనెను. వాఁడును ఖడ్గమును కేలధరించి "ఓ తరంగములారా! రాజాధిరాజుగారు మిమ్ము దూరముగాఁ దొలఁగుఁడనుచున్నారు. ఏమీ! మీకుఁ దెలియుటలేదా? ఈ క్షణమున మీ రతిక్రమింపనిచో మిమ్ము దండించెదరుసుఁడీ" అని గంభీరోక్తులపలికెను. అందఱు నిశ్శబ్దముగా నేమగునో యని చూచుచుండిరి. తరంగములెప్పటియట్లు వచ్చుచుండెను. తరువాత సేనాధిపతి, తదనంతరము మంత్రులుకూడ అట్లే చెప్పిరి. కాని యేమియు ఫలములేదయ్యె. అంతట రాజు సింహాసనము నుండి లేచి ఓ తరంగములారా! ఓరీ సముద్రుఁడా! మేము మహారాజులమగుట మీ కింకను దెలియుటలేదా? మా యాజ్ఞను నింకనుజెల్లింపకయున్నారు. చూడుఁడు. మాపరాక్రమము! అని సాయుధపాణియై సముద్రమువంక నతిభయంకరముగాఁ జూచెను. అందఱు వేడుకపడి చూచుచుండిరి. కొందఱు రాజునకు పిచ్చిపట్టినదని భావించిరి. అలలు తొల్లిటివలెనే వచ్చుచుండెను. అందొకపెద్దయల లేచి చివాలున రాజుమీదను మంత్రులమీదను బడుటచే వారివస్త్రాభరణాదులన్ని తడిసిపోయెను. రాజుకూర్చుండిన సింహాసనము నీటఁగొట్టుకొని

పోయెను. అంతరాజు అచటిజనులంజూచి యిట్లనియె. మీరందఱు చూచుచున్నారుగదా! నాయాజ్ఞ నణుమాత్రమైన యీసముద్రముగాని తరంగములుగాని నెఱవేర్చెనా? పంచభూతములను వశ్యపఱచుకొనుశక్తి నాకుండినయెడల అప్పుడు, మీకంటెను, సామాన్యజనులకంటెను శ్రేష్ఠుఁడనగుదును. సముద్రముప్పొంగి తటాలున భూమిని నీటముంచివేసినయెడల నేను దాని నడ్డగింపఁగలనా? శాశ్వతములనిభావించి యనేకదృఢతమ కృత్రిమకార్యములు మనుష్యులుచేసి భూమిపై నెలకొల్పియున్నారుగదా! ఒక్కమాఱు ఈ భూమికంపించినయెడల అవియన్నియు క్షణముననే నశించిపోవునుగదా! నేనుగాని మఱియేరాజుగాని మనుష్యుఁడుగాని అట్టియాపదలను దొలగింప సమర్థత వహించనగునా? లేదుగదా! కావున నరులందఱు తుల్యులు. తారతమ్యము లేదు. తాము పూజ్యులనియుఁ దక్కినవారు నీచులనియు భావించి సామాన్యజనులను పీడించుటగాని అవమానపఱచుటగాని దురహంకారము. అజ్ఞానము. మనుష్యులుగా జన్మించినతర్వాత తమతమకృత్యములు చేయుటకుమాత్రము బద్ధులైయున్నారుగాని నరస్తుతిచేయుటకుగాని తారతమ్యముగలిగించుటకుగాని యెవరికి నధికారము లేదు. అని రాజుపదేశింపఁగా వారందఱు బుద్ధితెచ్చుకొని నాటినుండి ముఖస్తుతులను మానిరి. రాజుయొక్క సద్గుణములను లోలోన మెచ్చుకొనుచు విహితకృత్యములను సక్రమముగా నాచరించుచు సుఖముండిరి.

# 9. త్రిమూర్తులు.

ఈ ప్రపంచముప్పతిల్లుటకుఁబూర్వము లోకమాత యగు పరాశక్తియుదయించెను. ఆమె త్రినేత్ర. సర్వశక్తిప్రదాయిని. సర్వతంత్రస్వతంత్ర. ఇష్టసిద్ధికై ప్రథమమున నామె బ్రహ్మనుసృజియించెను. అతఁడుదయింపఁగానే పరాశక్తికి సాష్టాంగదండప్రణామంబులాచరించి లేచి ముకుళితకరకమలుండై తల్లీ! ఏమియాజ్ఞ యనియడిగెను. అందులకామె మందస్మితయై యోయీ! నీవు నపుంసకుఁడవు. నిన్నువివాహమాడవలయునని నే సృజింపఁగా నిట్లొనరించితివియనుచు లలాటనేత్రముచే నతనిని భస్మముగావించెను. అనంతరమామె విష్ణుని సృష్టించెను. అతఁడుసహితము పుత్రిభావముతో నామెకు నమస్కరించెను. అందుచే విష్ణుఁడుసహిత మనర్హుఁడనియూహించి యాతనింగూడ దహించెను.

ఇట్లిరువురనుభస్మముగావించి యీపర్యాయము సఫలమనోరథనయ్యెదఁగాకయనుచు శంభుని సృష్టించెను. అతఁడుదయించి నలుదెసలం గలయంగనుంగొని నొకవైపు రెండు భస్మరాసులుండుటయు మఱియొకవైపు పరాశక్తి శృంగారచేష్టలు సలుపుచుంటయుఁజూచి "నీ వెవరవు? ఈ భస్మరాసులేమి? అని గంభీరోక్తులనడిగెను. ఈతఁడే తనకుఁదగినభర్త యనినిశ్చయించి పరాశక్తియిట్లనెను. ప్రపంచమునుసృజియిం

పంగోరి వీరిని నే సృజియించితి. వారు పుత్త్రీభావమువహించి నాకునమస్కరించిరి. అందువలన స్వాతంత్రమూర్తిమంతులు కాఁజాలరని వారిని భస్మముచేసి నిన్ను సృజియించితి. నా సర్వస్వము నీయధీనముగావించితిని. కావున నన్ను వివాహ మూశుము. అనంతరము మనము ప్రపంచసృష్టికిఁ గడంగుదము.

ఈ వార్తలను శివుఁడాలకించెను. పకపకనవ్వెను. అనంతరము వారిద్దఱిట్లు సంభాషించిరి.

పరాశక్తి:—ఏల నవ్వుచున్నావు?

శివుఁడు:—భార్యాభర్తలధర్మమెటువంటిదో నీవెఱుంగలేదు.

పరా:—నీ వెఱింగితివా?

శివు:—సమగ్రముగాఁ దెలిసికొనియున్నాను.

పరా:—వాక్రుచ్చుము.

శివు:—పతికి సతి యణఁగిమణఁగి భయభక్తులతో శుశ్రూషచేయవలయును. పతియాజ్ఞలేనిది భార్య యేకార్యమునుగాని చేయఁగూడదు.

పరా:—అట్లే కానిమ్ము. నీవు నన్నువివాహమాడుము.

శివు:—నీవు నాకుఁదగినభార్యవు కాఁజాలవు.

పరా:—ఏలం?

శివు:—నీకు లలాటనేత్రమున్నది. కుపితవైనప్పుడు నీవు నన్ను భస్మముచేయఁగలదానవు. మఱియొకనిని సృజియించెడి

దానవు. అంతటిశక్తికుండఁగా నేను నీకుభర్తనై యెట్లు నీవలనశుశ్రూషలందుదుట ?

పరా:—ఇప్పుడు నీవేమనెదవు ?

శివ:—నీలలాటనేత్రమును నాకొసంగవలయును. సృష్టించుశక్తిని నాకును గలిగింపవలయును.

అట్లే పరాశక్తి శివునికి త్రినేత్రములను, సృష్టించు శక్తిని ప్రసాదించెను. వానినిఁబొంది ముక్కంటి యిట్లాలోచించెను. పరాశక్తిని ఈ రూపముతోనే వివాహమాడుట యుక్తముకాదు. ఈమెమహిమనుతగ్గించి తరువాత పరిణయమగుటకర్జము. ఈ సోదరద్వయమును మరల పునర్జీవితులంజేసి వారికిని సమానభాగ మొసంగవలయును. అనియాలోచించి లలాటనేత్రముచే పరాశక్తిని భస్మముచేసి బ్రహ్మను, విష్ణువునులేపెను. వారు పునర్జీవితులై శివునికినమస్కరించిరి. జరిగినవృత్తాంతమంతయు శివుఁడు వారికెఱింగించి, పరాశక్తి భస్మరాశిని మూఁడుసమభాగములుగాఁ జేసి దేవీత్రయమును సృష్టించెను. మొదటియామెకు సరస్వతి యనిపేరిడి బ్రహ్మకొసంగెను. రెండవయామెకు లక్ష్మియనినామకరణమొనర్చి విష్ణునికిచ్చెను. లక్ష్మీసరస్వతులకంటెమిన్నయై పరాశక్తిగుణములుగలదైయుండు మూఁడవయామెకు గౌరియని పేరిడి తాను పరిగ్రహించెను.

అనంతరమీ త్రిమూర్తులును సృష్టికారంభించిరి. లోకత్రయమును, అందలిజీవకోటులును, తదావశ్యకములన్నియుఁ

గలిగెను. సృజియించుభారము బ్రహ్మవహించెను. రక్షించు కార్యము విష్ణువూనెను. శివుఁడు సంహారకర్తయు, నైశ్వర్య ప్రదాతయునయ్యెను.

బ్రహ్మసంబంధమైనవారు బ్రాహ్మణులు, విష్ణుభక్తులు వైష్ణవులు శివభక్తులు శైవులునైరి. దేవుఁడొక్కఁడే. సృష్టి సంరక్షణసంహారమనుకార్యభేదముచే మూర్తిత్రయము కలిగెను. ఈ తత్వమునెఱింగినవరులు శైవులేగొప్ప, వైష్ణవులే గొప్ప అనునిత్యాదిభేదభావములను తొలఁగించి జ్ఞానులయి యుందురు.



# 10. ప్రారంభశూరత్వము.

"ప్రారంభశూరత్వము, ప్రారంభశూరత్వము" అను లోకోక్తి సర్వత్రవ్యాపించియుండుట యందఱెఱింగినయంశము. ఇందుల కనేకు లనేకవిధములుగా పెక్కుకథలను వచియించెదరు. వానియాథార్థ్యమెటువంటిదో యూహించుట మన కగ్గముకానేరదు. కానియవి యుక్తియుక్తములై నీతినిమాత్రము స్పష్టముగాబోధించుచుండును. అట్టికథలలో దిగువవ్రాయఁబడియుండునదిసహితమొకటి. ప్రారంభశూరత్వమనగాఁ నొకపనిచేయుటకు మొదలుపెటునపుడుమాత్రమే గడిబిడిగాని ఆ కార్యమును గొనసాగింపకయే విరమించుట యని భావము.

గుంటూరిమండలమున క్రొత్తపట్టణమని యొకగ్రా
మము గలదు. బహుదినములకుఁబూర్వ మచట నొక బేహారి
యుండెను. ఆతఁడు మహాధనికుఁడు. భీమన్నయను నొక
కుమారు డతనికి జన్మించెను. బాల్యమున నతఁడు చదువు
సంధ్యలేవియులేక స్వేచ్ఛావిహారపరాయణుఁడై తిరుగుచుం
డుటజూచి యతనితండ్రి పలుమారు చీవాట్లుపెట్టుచుండెను.
ఒకనాఁడుభీమన్న తండ్రిచేఁ జీవాట్లుతినియిట్లనెను. తండ్రీ!
నాకు చదువురాలేదనుచింతవలదు. ఇప్పుడొకపదివేలరూప్య
ముల నిమ్ము. వానిని మూలధనముగానుంచుకొని గొప్పవర్త
కముచేసి కోట్లకొలదిధనముసంపాదించి నిన్నుసంతసింపఁజేసెద
ననెను. అతఁడట్లేయివ్వఁగా నొకపెద్దవర్తకశాలం గొని
యందనేకవస్తుజాలముల రప్పించియుంచెను. విద్యలేనివాఁడ
గుటచే వర్తకముజరుపుటకును లెక్కలువ్రాయుటకును తగిన
వారిని నెలజీతమునకు నిద్దఱినినియమించెను. యజమానుని
మూఢత్వము నెఱింగి వారు తంత్రముగా మూలధనమునంతయు
నిర్మూలముగావించిరి. అధమర్ణులందఱునసహిత మగ్లా తాము
ఋణమునకుఁ బుచ్చుకొన్న వస్తువులమూల్యముల నొసంగరైరి.
అందుచే భీమన్న కుపితుఁడై తండ్రియొద్దకువచ్చి నేను న్యాయ
స్థానమున కేగవలయును. నాకు రెండువేలరూప్యము లిమ్మని
యడిగిపుచ్చుకొని న్యాయవాదికడకేగి తనవృత్తాంతము చె
ప్పెను. ఇతనిమూఢత్వమును మాటలచేతనే యా న్యాయ
వాదియెఱింగి యా రెండువేలరూప్యములను బుచ్చుకొని కేఫు

రమ్ము పొమ్మనెను. అట్లే మఱునాడు వెళ్లగా సాక్షులు లేనిది నీవాదము చెల్లదు. ఈపాటి నీవెఱింగినందులకును నీ రెండు వేలరూప్యములకును సరిపోయిన దని న్యాయవాదియు నెను. అందువలన నితఁడు న్యాయస్థానమునకు పోఁగూడదని యనుకొనెను.

ప్రథమమున వర్తకముచేసెదను. అనియు ననంతరము న్యాయస్థానమున కేగెదననియు ననేకపర్యాయములు సర్వత్ర చెప్పికొనుచుండి యెందును సఫలమనోరథుఁడుగాకపోవుటచేఁ నందఱు నితనినిఁ బ్రారంభశూరుఁడని పిలుచుచుండిరి. మఱల భీమన్న తండ్రినడిగి విశేషధనముపుచ్చుకొని చదువుటకుఁ బ్రారంభించెను. ధనమంతయు నిమిషముననే వెచ్చించి విద్య నేర్చుట కష్టమని విరమించెను. ఇంతలో భీమన్న తండ్రి పరలోకగతుఁడయ్యెను. తండ్రిమరణానంతర మితఁ డనేకకార్యములకు మాటిమాటికిఁ బ్రయత్నించుచుండెనుగాని యెందును సఫలమనోరథుఁడుగాక పోయెను. ఇట్టి ప్రారంభశూరత్వదోషముచే నంత్యదశయం దితఁడు మహాదరిద్రుఁడయ్యెను. కావున నే కార్యమునుగాని దీర్ఘముగానాలోచించి పట్టుదలతోఁ జేయవలయును.



# 11. స్వదేశభాషాజ్ఞానమావశ్యకము.

దక్షిణహిందూస్థానమున చెన్నపురి సుప్రసిద్ధమయిన నగరము. అయ్యది రాజధానిపట్టణమగుటచే సుందరమందిరములనేకములు లెక్కకుమిక్కిలియై యుండు. నానాభాషలు మాటలాడుజనులు వచ్చియందు నివసించుచుందురు. ఆ నగరమున కొకయింగ్లీషుదొరగారు నూతనముగా వచ్చిరి. వారికి ఇంగ్లీషుతప్ప మఱేభాషయుఁ దెలియదు. వారు అనేకకోట్ల మూలధనముంచి యొక గొప్పవ్యాపారము నారంభించిరి. తమిళము, తెనుఁగు చెన్నపురిలో ముఖ్యమైనభాషలు. కావున "ఇంగ్లీషు, తమిళము, తెనుఁగు" అను నీమూఁడుభాషలనెఱింగిన యొకనిని తమయొద్దనుంచుకొని యతనిమూలముగా సకలకార్యములు నడిపించుకొనుచుండిరి.

ఒకనాఁడాదొరగారియొద్దకుఁ గొందఱు దొమ్మరివాండ్రు వచ్చిరి. ఆజ్ఞనుబొంది గడకట్టియాడి తమసామర్థ్యముచూపి దొరగారిని మెప్పించి యతనిమన్ననలకుఁ బాత్రులైరి. దొరగారు చాలసంతోషించి మూఁడుభాషల నెఱింగిన తనకార్యదర్శినిఁ బిలిచి యీ దొమ్మరివాండ్రకు నూరురూపాయలిమ్మని యాజ్ఞాపించిరి. వాఁడు వారిని తనయింటికిఁ బిలుచుకొనిపోయి యిదే దొరగారిమ్మనిరనిచెప్పి యొకరూపాయి మాత్ర మిచ్చి పొండనిపంపెను. వారందఱు వ్యసనాక్రాంత

చిత్తులై యొకతావున గుంపుచేరి యిట్లాలోచించిరి. దొరగారు మిక్కిలిమంచివారివలెఁ గనఁబడుచున్నారు. మనము చూపినవేడుకలను సాంతముగాఁ జూచిరి. మాటిమాటికిఁ నవ్వుచుఁ దలయూఁచుచు "గుడ్ గుడ్"అనిరి. ,వారు కోటీశ్వరులు. అంతటివారీయొకరూపాయిమాత్రమా యిచ్చియుందురు? యోచించఁగా నీ గుమస్తా దొంగవలెఁ గనఁబడుచున్నాఁడు. ఈ రూపాయిని దొరగారికిఁ జూపి మనము మొఱపెట్టుకొన్నచో వానిని దండించి మనకు మఱిబహుమానమిత్తురు.

ఇట్లాలోచించుకొని వారంద ఱాదొరగారికడ కేగిరి. వీరందఱు తెనుఁగువారు. తెనుఁగుభాషదక్క మఱియొకభాష వీరెఱుంగరు. అందువలన వీరు తెనుఁగులోనే బాబుగారూ తామెంతో గొప్పబహుమానమిమ్మని చెప్పియుండఁగా గుమస్తాగారంతయు నపహరించి యీయొకరూపాయినిమాత్రమిచ్చిరి. మాకష్టమునకుఁ దగినకూలికాదని దండములు పెట్టి చెప్పిరి. గుమస్తాను బిలిచి వారేమనెదరని దొరగా రడిగిరి. సమయజ్ఞతగల జిత్తులమారిగాన వాఁడు అయ్యా వీరు వేగురున్నారట. మీరిచ్చిన నూరురూపాయలు చాలవట. ఇంకా తొమ్మిదివందలరూపాయ లిచ్చినయెడల చెఱియొక రూపాయి చొప్పున భాగించుకొందురట అని యింగ్లిషులోఁ జెప్పెను. అతఁడు సజమని నమ్మి మిక్కిలికోపగించుకొని వారిని పనివారిచేఁ గొట్టించి పంపెను. దొరగారికి తెనుగు

తెలియదు. దొమ్మరివాండ్ర కింగ్లీషు తెలియదు. అందువలన నింత యనర్థమునకు హేతువయ్యెను.

కావున బ్రతిమనుజుఁడును అధమపక్షము రెండుభాషల నైన నేర్చియుండవలయును. అందును ముఖ్యముగా కార్యమునకావశ్యకమైన భాషను మంచుగా నేర్వవలయును. మన మే దేశమునకు వెళ్లఁదలఁచుచున్నారమో యాదేశభాషను దప్పక గ్రహింపవలయును.



## 12. విద్యాగర్వముకూడదు. 1

చోరపురియని యొకగ్రామముండెను. అందు "కర్ణీసుతు"డనువాఁ డొకఁడు సకలకలలను నేర్చి మిక్కిలిగర్వియై యెవరిని లక్ష్యముచేయక తిరుగుచుండెను. ఎవరియొద్దను అణఁగిమణఁగియుండుట కిష్టపడనివాఁడగుటచే నితనికి అన్నము పెట్టువారుకూడ నాయూరియం దెవరును లేకపోయిరి. అందువలన నితఁడు దొంగయయ్యెను. తనబుద్ధిచే మిక్కిలి సూక్ష్మముగా నితరులవస్తువులను దొంగిలించుచు తాను దొంగయను నంశము నెవ్వరునెఱుంగకుండ ప్రవర్తింపుచుండెను. దొంగ లెఱుంగవలసిన యంశములనెల్ల సొంతముగా నెఱింగి వారిలో నగ్రేసరుఁడై యుండెను. ఇట్లనేకదినములు గడిచెను. పలుదినములదొంగ యొకదినము చిక్కుకొనుట తప్పదనియూహించి

యొకనాఁడాతఁడు తానదివఱకు దొంగిలించి సంపాదించిన బంగారు, వెండి, రత్నాభరణముల నెల్ల నొకమూటగాఁగట్టి కొని తనయూరినుండి మఱియొకయూరి కేగి సుఖముగా జీవింప వచ్చుననునాశతో వెళ్లుచుండెను.

మార్గమధ్యమున నొక పెద్ద నూయియుండెను. ఆ నూతిగట్టున పదునాలుగేండ్లవయస్సుగల బాలుఁడొకఁడు కూర్చుండి బాష్పజలము కండ్లనుండి ధారధారగాఁ గారు చుండ నేడ్చుచుండెను. ఆ బాలుఁడు చంద్రబింబమునుంబోలిన ముఖారవిందముగలవాఁడై మిక్కిలిసౌందర్యవంతుఁడై యుం డెను. వానింజూచి కర్ణసుతుఁడు మిక్కిలిజాలిపడి నాయనా యేలయేడ్చెదవనియడిగెను. రూపవంతు లెట్టివారినైన వశ్య పఱచుకొందురుగదా! వాఁడు కన్నీరుతుడిచికొనుచు అయ్యా! నాపాపము నేమందును? నా తలిదండ్రులెల్లరు చనిపోయిరి. నాయూ రిక్కడికి నాలుగుక్రోసులదూరమున నున్నది. అందలి వారందఱు నాశత్రువులు. మానాన్నగారు కాలగతిచెందునప్పుడు "నాయనా! ఇదిగో రెండుమణుఁగుల బంగార మున్నది. ఇదియే నేనార్జించి నీకాస్తిగాఁ బెట్టియు న్నాను. ఈ యూరివారు కడుదుర్మార్గులు. పరులసొమ్ము నపహరించుటయందు ప్రాలుమాలికలేనివారు. నాయనంత రము దీని నీవు రహస్యముగా నెటకేనిఁ దీసికొనిపోయి సుఖ ముగా నుండు"మని చెప్పి పరమపదమున కేగిరి. వారికి దహన సంస్కారాది పరలోకక్రియలాచరించి యాబంగారును

గొనివచ్చుచు మార్గమధ్యముననుండు నీబావిలోఁ తొంగి చూచితి. అప్పుడు తలమీఁదనున్న యీ బంగారుమూట నీటఁ బడిపోయినది. ఏమిచేయుదును? ఎవరుదీసియిత్తురు? ఎట్లెటీఁగించుట? ఎట్లు జీవించుట? అని యేడ్చుచున్నానని పలికెను.

కర్ణీసుతుఁ డిట్లాలోచించెను. నాకు మంచికాలము సమీపించినట్లున్నది. నా యీసొమ్ముతోఁగూడ వీనిబంగారముసహితము అపహరించి వీని నీబావిం బడఁద్రోసిపోయి గౌరవముగా జీవించెదను లే. అనియాలోచించి వానిఁజూచి అబ్బాయీ! యేడువవద్దు. నీవిటఁగూర్చుండి నా యీమూటను వస్త్రములను జూచుకొనియుండుము. నే నీబావిలోమునిఁగి నీబంగారము గొనివచ్చెద ననిచెప్పి తనమూటను వస్త్రములను నటబెట్టి నూతిలోఁ దుమికెను. నీట మునిఁగి భూమిపర్యంతమువెళ్లి యనేకపర్యాయములు బాగుగా తడవి తడవి వెతకెను. కాని బంగారుమూటమాత్రము దొరకలేదు. అందుచే విసిగి మరల గట్టెక్కి వచ్చిచూచెను. బాలుఁడుగాని తన మూటగాని యట గనబడలేదు. ఒకచీటిమాత్రము పడియుండెను. దానిం దీసిచూడఁగా నందిట్లు వ్రాయఁబడియుండెను.

ఓరీ! కర్ణీసుతుఁడా నాకు బంగారులేదు, గింగారులేదు. నీ దొంగతనమెల్ల బహుదినములనుండి జాగ్రత్తగాఁ గనుంగొనుచుండి యెప్పుడు సమయముగలుగునాయని యుండఁగా నేడు సమకూడెను. నాపని యైనది. పోయెదను. నీవెందేని

పడిచావు” మనివ్రాసియుంటచూచి భయసంభ్రమాక్రాంత స్వాదయుఁడై, అహహా! అత్యాస యంతయుఁ జెఱుచునన్న సామెత సార్థకమయ్యెఁగదా! మఱియు నేను నాకంటె విద్యా కుశలుఁడు మఱియొకఁడు లేఁడనియుండ నన్నుసహితము మించిన యీ కుఱ్ఱవాఁడున్నాఁడు. ఎట్టివారును తామే గొప్ప వారమనుచు విద్యాధికులమనుచు భావించుట బుద్ధిహీనము. నేటినుండి యిఁక దుర్గుణమువదలి సన్మార్గ మవలంబించెద ననుచు స్వగృహాభిముఖుఁడయ్యెను.



## 13. విద్యాగర్వముకూడదు. ౨

పదునాఱవశతాబ్దమున నాంధ్రదేశమును రాయలవా రేలుచుండిరి. వారు రాజుమాత్రమేగాక విద్యావంతులయి విద్వాంసుల నాదరించుచుండిరి. పెక్కువిద్వాంసులు, కవులు రాజునాశ్రయించి యాస్థానముం గనిపెట్టుకొనియుండిరి. వారిలో తెనాలిరామలింగన్నసహిత మొకఁడు. ఇతఁడు సమయోచితబుద్ధిగలవాఁడు. వికటకవనముచెప్పుచు మాటిమాటికి రాజును తక్కినవారిని సంతసింపఁజేయుచుండును. ఇట్లుండ నొకనాఁడు దేశమంతట తిరిగి తనపాండిత్యముం జూపి విశేషబహుమానములందుచు నక్కడక్కడనుండు విద్వాంసులను శాస్త్రసంవాదముచే నోడించుచు నొకపండితాగ్రేసరుఁడు

రాయలదగ్గరకు వచ్చెను. అతనిరాక విని యక్కడివిద్వాంసు లెల్లరు భయపడి యిఁక తమకు రాజాస్థానమున గౌరవము దక్కదనియు రాజుగారు నూతనపండితునే సన్మానింతురనియుఁ దలఁచి తెనాలిరామలింగని యొద్దకేగి మొరయిడుకొనిరి. మీరు భయపడకుఁడు. రాజదర్శనముగాకమును పే యాపండితుఁడు ఈ నగరమునుండి పాఱిపోవునట్లుచేసెదను. అని యాతఁడు వారికి ధైర్యముచెప్పెను.

మహాగర్విష్ఠుమైన నూతనవిద్వాంసుఁడు "నేను దేశమం దలి పండితులనెల్ల జయించినవాఁడను. ఈ యూరియందలి విద్వాంసులందఱు నాకు తృణప్రాయులు. ఈవేళ మార్గా యాసముఁదీర నొకయింట విశ్రమించి రేపు రాజును దర్శిం చెదను. అనియూహించి యానాటిరాత్రి యొకయింట విశ్ర మించెను. అచటికి తెనాలిరామలింగన్న వచ్చి స్వామీ నమ స్కారము అనెను. అంతట వారిరువురకిట్లు సంభాషణము జరిగెను.

విద్వా:—ఓయీ నీవెవఁడవు?

రామ:—స్వామీ! నే నీయూరివిద్వాంసులదాసుఁడను.

వి:—నీవిందులకు వచ్చినకారణ మేమి?

రా:—నూతనపండితు లెవ్వరైన నిక్కడికివచ్చినయె డల ప్రథమమున నన్నువారి కడకుఁ బంపుదురు. మొదట నన్ను వాదమున జయించవలయును. తరువాతనే రాజాస్థా నము ప్రవేశించుట కవకాశముకలుగును.

వి:—నీ వేశాస్త్రమునుగుఱించి వాదించెదవు?

రా:—శాస్త్రముయొక్క పేరుచెప్పుటకుఁ బూర్వము ఒకయొడంబడిక యేర్పఱచుకోవలయును. నన్నుజయింపనిచో తెనాలిరామలింగన్నకు ఓడిపోయితినని వ్రాసి సంతకముచేసి నాచేతికిచ్చి యీక్షణ మీయూరిసివదలి వెళ్లవలయును.

వి:—అట్లే యగుఁగాక. నీచేతియందలి దేగ్రంథము?

రా:—తిలకాష్ఠమహిషబంధనగ్రంథము.

వి:—(తనలో) ఇది నూతననామము. వేదములు, శాస్త్రములు, కలలు అన్నిటిఁజదివి జగద్విఖ్యాతిగాంచిన నే నిట్టిపేరైన నిదివఱ కాలకించియుండలేదు. పేరే తెలియకుండఁగా నీ గ్రంథముంగూర్చిచర్చ యెట్లుచేయుట? సేవకుఁడే యింతటివాఁడై యుండఁగా వీనిగురువు లెంతటివారైయుందురో! ఇదివఱకు నాకంటె నన్యుఁడు లేఁడనియుంటిని. ఇప్పుడీయూరి విద్వాంసులసేవకునికే యోడిపోయితిని. “శాస్త్రివాదభయం” అని పెద్దలన్నట్లు ఎంతటివారైనను తమకు విశేషముగా వచ్చునని గర్వపడఁగూడదు. ఇఁక నిక్కడనున్నచో గౌరవము దక్కదు. అనియూహించి యొక కాగితము కలముదెప్పించి “తెనాలిరామలింగన్నకు శాస్త్రమున నోడిపోయితి”నని వ్రాసి వానిచేతికిచ్చి యీరాత్రే యటనుంచి యెటకో వెళ్లిపోయెను.

జరిగినవృత్తాంతమంతయు తెనాలిరామలింగన్నవలన నాలకించి యీయూరివిద్వాంసులందఱు దెట్లని యడిగిరి? అతఁడు తనచంకయందలి తిలవృక్షము మహిషబంధముఁజూపి

ఈ రెంటినిఁ జేర్చి "తిలకాష్ఠమహిషబంధగ్రంథ"మనియంటిని. ఈ పేరికే యతని కర్థము తెలియక చాలసేపాలోచించి చివరకు ఓడిపోయెను అనెను. అందఱు తెనాలిరామలింగన్నబుద్ధి కుశలత కచ్చెరువంది యతనిని వేనోళ్లఁ బొగడిరి. కావున విద్యాగర్వము కూడదు. సమయోచితబుద్ధి యన్నిటికంటె శ్రేష్ఠమైనది.



# 14. సమయోచితబుద్ధి. 1

గాంధారదేశమును నందనుఁ డనురాజేలుచుండెను. అతఁడు కోట్లకొలదిధనము వ్యయముచేసి తననగరమునకు వెలుపల నొక గొప్పతటాకము త్రవ్వించి చంద్రకాంతశిలలచే నలువైపుల చక్కని సోపానములు కట్టించెను. తటాకముచుట్టును వివిధ కుసుమ ఫలభరిత లతానికుంజపుంజములుగల శృంగారవనము నిర్మించెను. ప్రపంచమున నెక్కడను లేని సొగసైన సరోవరముంగని ఖేచరులుసహితం మద్దానింగొని యాడిరి. కాని యెంతవర్షము కురిసినను ఎంతప్రవాహమువచ్చినను సరస్సున నొకబిందుజలమైన లేకుండెను. అందుచే రాజు చింతాక్రాంతస్వాంతుఁడయి యొకనాఁడు సరోవరతీరమునకరుదెంచి "అక్కటా! యింతధనమువ్యయముచేసి యీ తటాకమును నిర్మించితి. ఏమిపాపమోగాని ఒకబొట్టునీరైననుండదు. అని యాలోచించుచుండెను.

ఆసమయమున కక్కడి కొకఋషీశ్వరుఁ డరుదెంచెను. తపఃక్లేశముచే నతనిశరీరము కృశించియుండెను. పాదాది కేశపర్యంతముగల నరసినరోమరాజి యతనివార్ధక్యముం దెలుపుచుండెను. జ్ఞానముగలవాఁడగుటచే నస్థిరమగుజగజ్జాలమును తృణకణముగా భావించి సర్వదా మందస్మితుఁడై తుష్టి చెందినవాఁడై యుండెను. అతనింజూచి రాజు ఎదురేగి సాష్టాంగముగా నమస్కరించి భక్తియుక్తుఁడై పిలుచుకొనివచ్చి యతిథిసత్కారముం గావించి తనకొరంతయంతయు చెలిపెను. అందులకు ఋషి "రాజా! యీకార్యమునకై వ్యసనపడనేల? సాహసవితరణాదిగుణసంపన్నుఁడైన యొకరాజునైన సకలయోగసంపన్నుఁడైన యొకఋషిసత్తమునైనఁ దెచ్చి యీదుర్గకు బలియిచ్చి యాకంఠరక్తముతోఁ గలిపినయన్నమును ఈ చెఱువునకు నలువలంకులఁ జల్లవలయును. అట్లుచేసినచో ని దుర్గయనుగ్రహించి కలకాల మీకొలంకునిండుగ జలముండునట్లుచేయుననెను. రాజు విని "అట్టివా రెవరుచిక్కుదురు. ఈ ఋషి మిక్కిలి గొప్పవాఁడు. ఇతనినే బలియొసంగి యీయనచెప్పినట్లు చేసెద"నని చివాలునఁ దనయొరనుండి కత్తిని దూసికొని యాయనమెడను ఖండించి యతఁడు చెప్పినట్లు చేసెను. ఆనిముసమముననే దుర్గయనుగ్రహమున చెఱువు స్వచ్ఛజలపూరితమయ్యెను. రాజు పరమానందభరితుఁ డయ్యెను.

హితముచెప్పువారు కాలదేశవర్తనమానములనెఱింగి

చెప్పవలయును. లేనియెడల ముప్పు తప్పదు. సర్వజ్ఞుఁడయ్యు ఋషి కీపాటి తెలియకపోయినందువల్లనే ప్రాణముం గోలుపోయెను. సమయోచితబుద్ధిగలిగియుంటచేతనే రాజు సఫలమనోరథుఁడయ్యె.



# 15. సమయోచితబుద్ధి. 2

ఒకధనికుఁడు అమితధనము వ్యయముచేసి విస్తారముగా నొకయారామము నిర్మించెను. దానిమధ్యమున నొక సుందర విశాలహర్మ్యముం గట్టికొని దేవేంద్రునివలె సకలసౌఖ్యముల ననుభవించుచుండెను. ఇతని కనేకులు సేవకులుండిరి. ఆరామమున ఘనసామ్రితమాలహింతాలనాళికేరాది భూరుహానికరము నిబిడీకృతమై చల్లఁదనము కలిగించుచుండెను. పుష్పఫలభరితతరులతాదు లందంద నేత్రానందకరమైయుండెను.

ఒకనాటిరాత్రి యాకాశమున మేఘములు నిబిడముగా నావరించెను. అవనీతలమంతయు నంధకారబంధురమయ్యెను. బ్రహ్మాండమడలంగ పటపటధ్వనులతో నురుములంతంతకు నురుముచుండెను. కడవలనుండి క్రుమ్మరించు తెఱంగున వర్షధారలు నిరంతరముపడుచుండెను. నిముసమముననే యెల్లెడల జలమయమయ్యెను. ఆ సమయమున ధనికుని సేవకులలో నొకఁ డెక్కడికో వెళ్లి మరల యజమానునియొద్దకు వచ్చ

చుండెను. గృహారామమునఁ బ్రవేశించినపుడు మార్గ మేదియో వృక్షమేదియో యతనికిఁ గనఁబడలేదు. దారి తప్పియడుగిడుటచేఁ దటాలున నొకకృష్ణసర్ప మితనికాలికిఁ జుట్టుకొనెను.

వాఁడు సమయోచితబుద్ధిగలవాఁడు గావున నిట్లాలోచించెను. ఒకవేళ నేను నాపాదమును ఈ సర్పముయొక్క తలమీఁద నుంచియుండవచ్చును. అట్లయినచో నుపాయముచే నా ప్రాణముల సంరక్షించుకోవచ్చును. ఈశ్వరాజ్ఞ యెట్లున్నదో యెవ్వరెఱుంగుదురు? ఆయుర్దాయము బాగుండినచో నెంతయాపదనుండియైన దప్పించుకొనవచ్చును. అని చింతించి తనపాదము నెత్తకయే యింటివారికి వినవచ్చునట్లు బిగ్గరగా అయ్యో యెవ్వరైన త్వరగా దీపముతో వచ్చి నన్ను రక్షింపుఁడు రక్షింపుఁడని కేకలువైచెను. గృహయజమానుఁ డాలకించి యది తన సేవకునికంఠధ్వని యనియెఱింగి యతివేగముతో ననేకదీపములుగొని సేవకులు వెంటరా బడియ కేలం ధరించి యటకరుదెంచె. వచ్చిచూడఁగాఁ దన సేవకునిపాదము సరిగా సర్పముయొక్క పడగమీఁదనే యుండెను. వానిబుద్ధికిని, ధైర్యమునకును మెచ్చుకొని యుచితోపాయములచే సర్పమును జంపి వానిని సంరక్షించెను.

సమయజ్ఞత సర్వశ్రేయము.



# 16. సర్వసంగపరిత్యాగులుసదానందులు.

పూర్వము భర్తృహరి యనియొకరాజుండెను. భుజబలముచే సకలమహీపతులనుజయించి ఆయన నిష్కంటకముగా భూమినిఁ బరిపాలించుచుండెను. ఒకనాడాతఁడు మృగయాప్రియుఁడై మంత్రిసామంతదండనాథులు వెంటరా చతురంగబలసమేతుఁడై పరిసరారణ్యమున కేగి సింహశరభశార్దూలాద్యరణ్యజంతుసంతానముల నమితముగా వేటాడి మరలివచ్చుచుండెను. మార్గమధ్యమున నొకభూరుహచ్ఛాయ ఋషీశ్వరుఁడొకఁడు నేలపై పవ్వళించియుండెను. ఆహారాదులు లేకపోవుటచే కృశించిన యంగములుగలవాఁడై యుండె. అయినను వానిముఖముమాత్రము మందస్మితముగలదైయుంటజూచి రాజాశ్చర్యపడి యాతనితో నిట్లు ప్రశ్నించెను. తరువాత నాయిరువుర కిట్లు సంవాదముజరిగెను.

రాజు:—అయ్యా! నీకేదియు శయ్యలేదా? ఈ మట్టిలోపడి యేల పొర్లాడెదవు?

ఋషి:—నాకీ భూమియే రమణీయమైన శయ్య. ఇది శాశ్వతమైనది. తక్కిన శయ్యలన్నియు నశ్వరములు.

రా:—తలక్రిందినైన నేదేనియుంచుకోరాదా?

ఋషి:—రాజా! ఈభుజలతయే విపుల ముపధానము.

రా:—ఇల్లువాకిలి లేక దిక్కుమాలిన యీవనమున నుండుటవల్ల నీ కేమిసుఖము కలుగును?

ఋ:—రాజా! సుఖమనఁగా నాదియే సుఖము. నీవు ఈ పాడుఐహికసుఖములను శాశ్వతములని భావించియుంటచే నట్లుతలంచెదవు. సాంతముగా నాలకింపుము. అఖండైశ్వర్య భూమండలాధిపతిసహితము నాతో సాటికానేరఁడు. అనుకూలుఁడైన యీయనిలుఁడు నాకు శాశ్వతమైన వీవన. గాలి వచ్చునట్లు చేయుటకు పరికరముగాని మనుష్యులుగాని నాక నవసరము. ఈ యాకాశమే నాయింటి పైకప్పు. దీనిఁ గట్టుటకుఁగాని మాటిమాటికి సంస్కరించుటకుఁగాని మనుష్యులు పనిలేదు. ఈ గృహమునకు సూర్యచంద్రులే దీపములు. ఇవి తైలము నపేక్షింపవు. గాలికి ఆరవు. విరతివనితయే నాకు ప్రియభార్య. తుష్టిచెందినవారి కీప్రపంచము తృణప్రాయము. నా కేభయములేదు. నరస్తుతిచేయను. పాడుసౌఖ్యములకై మహారాజవైన నిన్నుసహితము లక్ష్యపెట్టను. క్షణభంగురమగు నిశరీరసౌఖ్యమునకై తమ్ముఁ దామెఱుంగక మానువచ్చునదిగానక జీవకారుణ్యములేక యుండు తుచ్ఛుల నాశ్రయించి బ్రతుకుటకంటె నిస్థితి యెంత యుత్తమమయినదో చూడుము.

ఈ వాక్యము లాలించి రాజు సంతసించి రాజ్యమును తమ్ముఁడైన విక్రమార్కునికిఁ బట్టముకట్టి తానును జ్ఞానియై సర్వసంగపరిత్యాగియయ్యెను. వనముననే సంచరించుచుండి

కందమూలఫలములను భుజింపుచు కాలముగడుపుచుండి ప్రపంచమున కత్యంతోపయుక్తములగు నీతిశతకము, శృంగారశతకము, వైరాగ్యశతకము మున్నగు సద్గ్రంథములను రచించెను.



# 17. దానము. 1

విక్రమార్కమహారాజు మహాపరాక్రమవంతుఁడు. దానకర్ణావతారుఁడు. ఎవరేదికోరినను లేదనక యిచ్చుటలో నితనికి సమానులుగాని అధికులుగాని యెవ్వరును లేరు. ఉజ్జయినీనగరము నితఁడు పరిపాలించుచుండెను. ఆ పట్టణమున పురందరుఁడను వైశ్యకుమారుఁడొకఁడు కోట్లకొలదిధనమును నిరంకుశముగా వ్యయముచేసి యచిరకాలముననే దరిద్రుఁడయ్యెను. అంతేగాక విశేషముగా ఋణములుదీసి సహితము ఖర్చులుచేసి మరల ఋణవిమోచనముచేయుటకు శక్తిలేక యుత్తమర్ణులబాధపడలేక దేశాంతరగతుఁడయ్యెను. దేశమంతట తిరిగితిరిగి యందందుఁగల వింతలఁ జూచుచు ధనార్జనమునకై యెంతో ప్రయత్నించినను ఒకచిల్లిగవ్వయైన నితనికిచ్చువారెవరు లేరైరి. ఎచ్చోటజూచినను దానమున విక్రమార్కునికంటె నన్యుఁడులేఁడని ప్రశంసించుచుండిరి. మనరాజంతటిదానకల్పతరువై యుండఁగా మనమేల యూ

రూరఁ దిరుగుచుండవలయునని యూహించి స్వనగరాభిముఖుఁడయ్యెను. మార్గమున మధురాపురిలో నొకనాటి రాత్రి యొకముసలమ్మయింట భుజించి యాయింటియరుగు మీఁద శయనించియుండెను. అర్ధరాత్రమున నతని కొకస్త్రీ యేడ్చునట్లును ఎవరో యామెను గొట్టుచుండునట్లును వినవచ్చెను. అప్పుడాతఁ డాముసలమ్మను జూచి అవ్వా ఆధ్వని యేమనియడిగెను. అందులకామె అబ్బీ ఈ నగరమునకుత్తరమున నొక బిల్వవనమున్నది. అందొకభైరవునిగుడియు, కాళికాదేవ్యాలయమును గలవు. బహుదినములనుండి యొకరాక్షసుఁ డొకస్త్రీనిఁ గొట్టుచున్నట్లును ఆమెయేడ్చుచుండునట్లును కింవదంతి సర్వత్ర వ్యాపించియున్నది. రాక్షసునికి భయపడి యెవ్వరు నచటికి వెళ్లుటలేదు. నీకేందుకా జోలి. నెమ్మదిగా పరుండి నిదురింపుమనెను. అతఁడట్లే నిదురించి మరునాఁడుదయమున లేచి యుజ్జయినినగరమునకరుదెంచి విక్రమార్కుని దర్శించి తనదారిద్ర్యవిషయమంతయుఁ జెప్పి దేశాంతరమేగి యందందుఁగల చోద్యములఁ జూచిన తెఱంగెఱింగించి మధురాపట్టణవృత్తాంతముసహితము తెలిపెను.

తత్క్షణమే విక్రమార్కుఁడు చంద్రాయుధము ధరించి వానిందోడుకొని మధురాపురంబునకేగి యాముసలమ్మయింట విడిసి భుజించి యారాత్రి వారట పరుండిరి. తొల్లిటివలెనా యేడ్పుధ్వనివినవచ్చెను. రాజు సాయుధపాణియై లేచి

యా స్థానమునకు వెళ్లెను. అప్పుడు భయంకరాకారుఁడగు నొకరాక్షసుఁడు సుందరవదనారవిందముగల యొకవనితను గొట్టుచుండెను. రాజు కుపితుఁడై చంద్రాయుధముచే రాక్షసుని సంహరించి యాకన్యంజూచి నీవెవ్వరవు? నిన్నేల యీ రాక్షసుఁడు కొట్టువాఁడని యడిగెను. అందుల కామె రాజా నే నీయూరిలోని యొక ధనవంతుఁడైన వైశ్యునికూఁతును. నా రూపమునుజూచి మోహించి యీరాక్షసుఁడు నా తలిదండ్రులను సంహరించి ధనమంతయు నపహరించి యీ కాళికాదేవ్యాలయమున నొకవైపునఁ బాతిపెట్టి తన్ను వివాహమాడుమని ప్రతిదినమును నన్ను బలాత్కారముచేయుచుండువాఁడు. నేనందులకు సమ్మతించకపోవుటచే నిట్లు కొట్టుచుండును. నా భాగ్యవశమున నేడు నీవువచ్చి నా యాపదను తొలంగించితివి. ఇఁక కనికరించి యీధనముం గ్రహించి నన్ను వివాహమాడుమనెను.

రాజు పురందరునిఁ బిలిచి యాధనమంతయు త్రవ్వి యిప్పించి యాకన్యను అతనికి పెండ్లిచేసియిచ్చి సుఖముగా నుండుఁడని దీవించి తనస్థానమున కరిగెను. వాఁడును నా నూరుకోట్లధనము చేఁగొని భార్యాసమేతుఁడై స్వనగరమున కరుదెంచి ఋణబాధం దొలఁగించుకొని విక్రమార్కునియుదారత్వమును వేనోళ్లఁగొనియాడుచు సుఖముగా నుండెను.

# 18. దానము. 2

విక్రమార్కుఁ డొకప్పు డొంటరిగా భూసంచారము చేయుచుండెను. అట్లుసంచరించుచు నొకనాఁడు పుళింద దేశమునందలి పాపవినాశిని యనునదిలో స్నానమాచరించి నిత్యకర్మానుష్ఠానములొనర్చి యానదీతీరమందలి వనమునఁ బ్రవేశించి యందలి ప్రకృతిసౌందర్యమున కచ్చెరువందుచుఁ బోవుచుండెను. అట నొకవృక్షమూలమున నొకసిద్ధుఁడు కనులుమూసి ధ్యానములోనుండెను. విక్రమార్కుఁ డతనికి నమస్కరింపఁగా నీవెవఁడవు? రాజలక్షణములతో నున్నాఁడవు? అని సిద్ధుఁడడిగెను. అందులకు రాజు "నేను విక్రమార్కమహారాజను. ప్రతిసంవత్సరమును నిట్లొంటరిగా భూసంచారముచేయుచుందు" ననెను. సిద్ధుఁడాతనిఁజూచి రాజా నీవు రాజ్యమునువదలి యొంటరిగాఁ దిరుగుట నీకు శ్రేయస్కరముకాదు. నీ కాపదసంభవించును. పరులు నీ రాజ్యము నాక్రమింతురు. వేగిరముగా నీనగరమునకుఁ బొమ్మని పలికెను. అందులకు రాజు నవ్వియిట్లనెను.

స్వామీ! తాము సర్వజ్ఞులు. సుఖదుఃఖములు కర్మానుసారముగా వచ్చును. ఒంటరిగానున్న నేమి? మఱి యొట్లుండిననేమి? 'కానున్నది కాకమానదు. పూర్వము రాజశేఖరుఁడనేరా జొకఁడుండెను. ఆయన పగవారిచే రాజ్యము కోలుపోయి తనభార్యతోఁగూడ అరణ్యముప్రవేశించెను.

కందమూలాదులను భక్షించుచు వృక్షమూలముల శయనించుచుఁ గాలముగడుపుకొనుచుండెను. ఒకనాఁడాతఁ డొక వటవృక్షచ్ఛాయ విశ్రమించి తనకుఁ గలిగినకష్టమునకును రాజ్యనష్టమునకును బలువిధముల చింతించుచుండి యిక మరణముదక్క వేరుశరణములేదని యూహించి భార్యయుఁ దానును ప్రాయోపవేశమునకై యత్నించెను. ఆ సమయమునకెక్కడనుంచియో చతురంగబలసమేతులై పురవాసులు, మంత్రులు కొందఱరుదెంచి యొకపట్టపుటేనుఁగుఁజూపి రాజశేఖరునితో నిట్లనిరి. "స్వామీ మేము మద్రపురవాసులము. మారాజు సంతానములేక చనిపోయెను. ఈ యేనుఁగును చతురంగబలమును నతనివే. అరాచకమగు రాజ్యమున కెవరురాజగుదురో యనివిచారించుచుండ నిన్నరాత్రి పరమేశ్వరుఁడు మాస్వప్నమున ప్రత్యక్షమై "రాజశేఖరుఁ డనురాజు రాజ్యముంగోలుపోయి యీ నగరసమీపమున వటవృక్షచ్ఛాయ నున్నాఁడు. ఆతనింబిలుచుకొనివచ్చి పట్టముగట్టి రాజుగావించుకొనుఁడని" యాజ్ఞాపించి యదృశ్యుడయ్యెను. కావున నిపట్టపుటేనుఁగు నధిరోహించి వచ్చి రాజ్యభారము వహించి మమ్ము నేలుము" అని వారందఱు ప్రార్థించఁగాఁ దటాలునఁ గలిగిన మంగళపరంపరకానందించుచు నల్లయానగరమునకు రాజయ్యెను. ఈ వృత్తాంత మితనితో నిదివఱకి శత్రువు తెలిసికొని మరల ఇతనిమీద దండెత్తివచ్చెను. నూతనసైన్యముంగొని వానింజంపి పోఁగొట్టుకొన్న రాజ్యమును

# 18. దానము. 2

విక్రమార్కుఁ డొకప్పుడొంటరిగా భూసంచారము చేయుచుండెను. అట్లుసంచరించుచు నొకనాఁడు పుళింద దేశమునందలి పాపవినాశిని యనునదిలో స్నానమాచరించి నిత్యకర్మానుష్ఠానములొనర్చి యానదీతీరమందలి వనమునఁ బ్రవేశించి యందలిప్రకృతిసౌందర్యమున కచ్చెరువందుచుఁ బోవుచుండెను. అట నొకవృక్షమూలమున నొకసిద్ధుఁడు కనులుమూసి ధ్యానములోనుండెను. విక్రమార్కుఁ డతనికి నమస్కరింపఁగా నీవెవఁడవు? రాజలక్షణములతో నున్నాఁడవు? అని సిద్ధుఁడడిగెను. అందులకు రాజు "నేను విక్ర మార్కమహారాజను. ప్రతిసంవత్సరమును నిట్లొంటరిగా భూసంచారముచేయుచుందు" ననెను. సిద్ధుఁడాతనిఁజూచి రాజా నీవు రాజ్యమునువదలి యొంటరిగాఁ దిరుగుట నీకు శ్రేయస్కరముకాదు. నీ కాపదసంభవించును. పరులు నీ రాజ్యము నాక్రమింతురు. వేగిరముగా నీనగరమునకుఁ బొమ్మని పలికెను. అందులకు రాజు నవ్వియిట్లనెను.

స్వామీ! తాము సర్వజ్ఞులు. సుఖదుఃఖములు కర్మా నుసారముగా వచ్చును. ఒంటరిగానున్న నేమి? మఱి యొట్లుండిననేమి? కానున్నది కాకమానదు. పూర్వము రాజ శేఖరుఁడనేరా జొకఁడుండెను. ఆయన పగవారిచే రాజ్యము కోలుపోయి తనభార్యతోఁగూడ అరణ్యముప్రవేశించెను.

కందమూలాదులను భక్షించుచు వృక్షమూలముల శయనించుచుఁ గాలముగడుపుకొనుచుండెను. ఒకనాఁడాతఁ డొక వటవృక్షచ్ఛాయ విశ్రమించి తనకుఁ గలిగినకష్టమునకును రాజ్యనష్టమునకును బలువిధముల చింతించుచుండి యిక మరణముదక్క వేరుశరణములేదని యూహించి భార్యయుఁ దానును ప్రాయోపవేశమునకై యత్నించెను. ఆ సమయమున నెక్కడనుంచియో చతురంగబలసమేతులై పురవాసులు, మంత్రులు కొంద ఱరుదెంచి యొకపట్టపుటేనుఁగుఁజూపి రాజశేఖరునితో నిట్లనిరి. "స్వామీ మేము మద్రపురవాసులము. మారాజు సంతానములేక చనిపోయెను. ఈ యేనుఁగును చతురంగబలమును నతనివే. అరాచకమగు రాజ్యమున కెవరురాజగుదురో యనివిచారించుచుండ నిన్నరాత్రి పరమేశ్వరుఁడు మాస్వప్నమున ప్రత్యక్షమై "రాజశేఖరుఁ డనురాజు రాజ్యముంగోలుపోయి యీ నగరసమీపమున వటవృక్షచ్ఛాయ నున్నాఁడు. ఆతనింబిలుచుకొనివచ్చి పట్టముగట్టి రాజుగావించుకొనుఁడని" యాజ్ఞాపించి యదృశ్యుఁడయ్యెను. కావున నీపట్టపుటేనుఁగు నధిరోహించి వచ్చి రాజ్యభారము వహించి మమ్ము నేలుము" అని వారందఱు ప్రార్థించఁగాఁ దటాలునఁ గలిగిన మంగళపరంపర కానందించుచు నల్లయానగరమునకు రాజయ్యెను. ఈ వృత్తాంత మితనితో నిట్టి శత్రువు తెలిసికొని మరల ఇతనిమీఁద దండెత్తివచ్చెను. నూతనసైన్యముంగొని వానింజంపి పోఁగొట్టుకొన్నరాజ్యమును

సహితము సంపాదించుకొని సుఖముండెను. చూచితిరా? మంచికాలముండినచో నెంతయాపదసంభవించినను మరల సుఖమందవచ్చును. నాకిప్పుడు దైవబలమున్నది. కావున నాకేదియు భయములేదు.

అని విక్రమార్కుఁ డనఁగా సంతోషించి యాసిద్ధుఁడు తనయొద్దనున్న చిన్నిస్ఫటికలింగ మొకదాని నతనిచేతికిచ్చి "ఇది శివునిచే నాకీయఁబడినది. దీనిని భయభక్తులతో అర చేతియందుంచుకొని పుష్పములతోఁ బూచించి యేవేళ నేది కావలయునని తలంచినను ఆనిముసమున నే యొసంగును. స్వేచ్ఛగాను ఒంటరిగాను సంచరించెడి నీకియ్యది యత్యంతా వశ్యమైన"దని యొసంగెను. విక్రమార్కుం డద్దానింబుచ్చు కొని యతనికి నమస్కరించి కొంతదూరమరిగి సిద్ధునివాక్య ముం బరీక్షింపనెంచి లింగముం బూజించి నవరత్నఖచితము లయిన స్వర్ణభాండములు నూఱును, వానినిండుగ నమూల్య రత్నాభరణములును గలుగవలయునని మదిం దలంచెను. ఆక్షణమున నే యతఁడు కోరినవన్నియు సిద్ధింపఁగా రాజు సంతోషించెను.

ఆసమయమున నొకబ్రాహ్మణుఁడట కరుదెంచి విక్ర మార్కునినాశీర్వదించి రాజా! నేనొకబీదబాపఁడను. బ్రహ్మ చారిని. వివాహమాడవలయునని కోరిక నాకు మెండుగా నున్నది. దారిద్ర్యభరముచే నయ్యది సిద్ధించుటలేదు. నీ కీర్తి దిగంతవిశ్రాంతమై యుండుటయెఱింగి నీకడ కరుదెంచితి.

ఇఁక నిచ్చెదను. నాభాగ్య మనిపలికెను. అనవిని విక్రమాది త్యుఁ డాలింగమును మరల పూజించి యొక చక్కని బ్రాహ్మణ కన్య కలుగవలయునని తలంచెను. ఆక్షణముననే నవరూప లావణ్యరాశియగు కన్యక సర్వాభరణభూషితురాలయి వారియెదుట నిలుచుండెను. రా జాబ్రాహ్మణునిఁజూచి "ఇదిగోనున్న నూరుస్వర్ణభాండములను బుచ్చుకొని యీ కన్యం బెండ్లాడి సుఖముగా నుండు"మనిచెప్పఁగా నాతడట్లు చేయుట కంగీకరించి యంతటితోఁబోవక యాలింగమును సహితము తనకిమ్మని యడిగెను. రాజు కొంచెమైనను చింతిం చక సంతోషముతో నమూల్యగుణముగల యా లింగ మతని కిచ్చెను.

ఆనిముసమున నే యాబ్రాహ్మణుఁడును కన్యయు స్వర్ణ భాండములు నన్నియు నదృశ్యముకాఁగా విక్రమార్కుఁ డచ్చెరువంది చూచుచుండెను. అంత నాసిద్ధుఁడు ప్రత్యక్షమై రాజా నీయుదారత్వముపరీక్షించుటకై నేనే యాబ్రాహ్మణ రూపముతో నరుదెంచితి. ఇఁక నీతోసమాన దానగుణము గలరాజు లోకమున లేకపోవుగాక యనియాశీర్వదించి నిజే చ్ఛంజనియె. విక్రమార్కుఁడు స్వనగరమున కరుదెంచి సకల ధర్మములాచరించుచు సుఖముగా రాజ్యముచేయుచుండెను.



# 19. బ్రహ్మతేజోబలము.

పూర్వము కౌశికుఁ డనునొకరాజుండెను. అతఁడు మహాబలసంపన్నుఁడు. ఒకనాఁడాతఁడు చతురంగబలసమేతుఁడై మృగయార్థ మరణ్యమున కేగి సింహ శరభ శార్దూలాదిమృగంబుల నమితముగా వేఁటాడెను. వేటముగిసిన తర్వాత సైనికులును దానును మరల స్వనగరాభిముఖుఁడై వచ్చుచుండెను. మార్గమధ్యమున వసిష్ఠఋషీశ్వరునియాశ్రమ ముండెను. ఆయన విందారగించుటకు "నాయాశ్రమమునకురండ"ని రాజును, సైనికులను పిలిచెను. వనమునఁ గందమూలములను భక్షించుచు కుటీరమున నివసించుముని తమ కేమి విందొనరించునని చులకనగా భావించుచు వారతనియాశ్రమమున కేగిరి. వసిష్ఠమహర్షి యెదుట కామధేనువు నిలిచియుండెను. "ఈరాజునకును నీతనిసైనికులకును యథేష్టభోజ్యపదార్థముల సమకూర్చి యాదరింపు"మని ఋషీశ్వరుఁ డానతిచ్చెను. అట్లే యాధేనువు వారువారుండినస్థలములనెల్ల నొక్కొక్క సుందరవనితారూపముదాల్చి యెదుటనిలిచి మిక్కిలి రుచికరములగు నాహారపదార్థములు యథేష్టముగా నొసంగి సకలోపచారములొనర్చి మాయమయ్యెను.

అనంతరము కౌశికమహారాజు వసిష్ఠునియొద్ద కరుదెంచి ఋషిసత్తమా! నీయనుగ్రహముచే మేమందఱము తృప్తిగా

భుజించినారము. సకలోపచారములు సమగ్రముగా నంది తిమి. సంతుష్టాంతరంగుల మైతిమి. నారాజ్యము, సంపద, నేను, సైన్యము మఱియేదియుఁగూడ నీయొక్క ధేనువునకుం సాటియగుట దుర్లభము. నావంటిరాజుల కీర్తిధేనువు దప్పక యుండఁదగినది. అరణ్యమున నివసించు నీకిదియేల? కావున దీనిం నాకొసంగుము. ఇందులకై లక్షపాడియావుల నీకొసం గెద. అంతేగాక మఱేదికావలసినప్పటికి నిచ్చెదను. అని యడిగెను. అందుల కతఁడు రాజా "ఇది కామధేనువు. దేవ తలకును బ్రహ్మతేజోవంతులగు ఋషీశ్వరులకుమాత్రమే వశ్య మైయుండును. దీని నిచ్చుటకు నేనసమర్థుఁడను. కావున నీయాశనువదలి స్వనగరమునకుఁ బొమ్ము" అనిచెప్పెను. రాజాతనిపలు కలక్ష్యముచేసి యాధేనువును బట్టుకొనుఁడని యాజ్ఞాపించెను. అంత సైనికులంద ఱొక్కుమ్మడిగా దాని వైఁబడి పట్టుకొనఁబోయిరి. అది యొక్కరికినిఁ జిక్కక వారి నందఱిని క్షణకాలముననే ధ్వంసముచేసెను. ఇట్లు సైనికులం దఱొకనిమిషమున నొకధేనువుచే నాశమైనందులకుఁ జింతిం చుచు రాజు కుపితుఁడై యావసిష్ఠునిఁ జంపినయెడల ఇది సుల భముగా వశ్యమగునని భావించి ధనువును కేలధరించి యనేక శస్త్రాస్త్రము లనతనిపైఁ బ్రయోగించెను. వసిష్ఠుఁడు మందస్మి తుఁడై యొకదర్భనుమంత్రించి తనయెదుటనై చెను. రాజు ప్రయోగించు క్రూరమయిన సకలాస్త్రశస్త్రములును ఆదర్భ యొద్దకువచ్చి నిర్వీర్యములై భూమింబడి భస్మావశిష్టము లగు

చుండెను. అంత రాజిట్లాలోచించెను. ఆహా యీపాడురాజరిక మెందులకు? ఈసైన్య మెందులకు? ఈబాణము లేల? ఈ నాక్షత్రియబలము కాల్పనే? బ్రహ్మతేజోబల మొక్కటియే బలము! ఈభూమండలమందలి యైశ్వర్యసమూహమంతయుఁ జేరినను గూడ బ్రహ్మతేజమునకు సరిపోలదు. ఇఁక నాకు రాజ్యము గీజ్యము పనిలేదు. నేసహితము తపనాచరించి బ్రహ్మఋషియయ్యెదను. అని యట్లే యదేయరణ్యమున ఘోరతపస్సుచేసి మహామహిమగల బ్రహ్మఋషియయ్యెను. ఆతనికే విశ్వామిత్రమహర్షి యనిపేరు. వసిష్ఠుఁడీతని వైరాగ్యమునకు మిక్కిలి యచ్చెరువందెను.

బ్రాహ్మణులందఱుఁ బట్టి పిరికిపందలై యుండిరని యిప్పుడు కొందఱు భావించెదరు. అట్టివారికి ప్రపంచజ్ఞానమే లేదనవచ్చును. రామాయణ మహాభారతములను జదివినచో బ్రహ్మతేజోబలమహిమ వెల్లడియగును.



# 20. సుఖదుఃఖము లీశ్వరాయత్తములు.

మిత్రవర్మ యను నొకరాజు వనవిహారేచ్ఛ మతిఁబొడమ నేకాకియై యొకనాఁడు పరిసరారణ్యమునంగల ప్రకృతిసౌందర్యము నవలోకించుచుండెను. వనమునందలి వివిధ తరులతా నికుంజపుంజములును, పుష్పఫలాదులు నతనినేత్రము

లను సఫలముగావించుచుండెను. నానావిధములైన విహంగ రుతకోలాహలమ్ములు వీనులవిందైయుండెను. ఆసమయమున నచట నొకవృక్షమూలమున నొకసుందరవనిత పరుండి యేదియో యొక యనిర్వచనీయమయిన బాధ పడుచుండెను. రాజు దయార్ద్రహృదయుఁడై యామెను సమీపించి "నీవెవరవు? ఏలయిట్లు బాధపడుచున్నావు? నీకేమి కావలయును? నేను తోడుపడెదను చెప్పు"మని యనేకవిధముల నడిగెను. అందుల కామె యిట్లనెను.

అయ్యా! నేనీవనమందలి యొకకిరాతవనితను. నా భర్త వేటాడుటకై వెల్లియున్నాఁడు. మా కిల్లువాకిలి యేదియు లేదు. అవి మాకనవసరములు. కందమూలములను, వేటాడిన మృగాదులను భక్షించి జీవించుచుందుము. మాలో నొకరి కొకరు తోడుపడుటలేదు. అట్లు తోడుపడినచో మాజాతికే పరువు దక్కదు. మనుష్యజన్మమెత్తినవారికందఱికి దేవుఁడు కరచరణాద్యవయవములను బుద్ధినిఁ బ్రసాదించియున్నాఁడు. అట్లుండ తమతమకృత్యములను దామే యాచరించుకోవలయునేగాని యితరులసాయముగోరుట బుద్ధిహీనము. మృగములును పక్షులును ఏపాటియన్యాపేక్ష లేక జీవించుచుండలేదా? సర్వేశ్వరుఁడు దేవుఁడుండ తుల్యపంచేంద్రియసమాయుక్తులైన నరులలో నొకరు గొప్పవారనియు, నొకరు కొలదివారనియు భావించుటయు స్వామిభృత్యభేదములచే మెలంగుటయు పాపహేతువుదక్క వేఱుకాదు. నేనిప్పుడు ప్రసవవేదన నను

భవించుచున్నదానను. నాకు నీసహాయము వలదు. దూరముగాఁ బొమ్ము.

అనిన యావనితయొక్క దృఢచిత్తంబున కచ్చెరువంది యేమిజరుగునో చూతమనుచు రాజు బదులేమియుఁ బలుకక కొంతదవ్వరిగి యొకచెట్టునీడను విశ్రమించియుండెను. ఇంచుక సేపునకంతయు నామెకొకపురుషశిశువు జన్మించెను. అంత నావనిత యల్లల్ల లేచి సమీపమందలి యొకనరస్సున స్నానమాచరించి యాశిశువును శుభ్రముగా స్నానముచేయించి గ్రక్కున శిశువుగొని నిజేచ్ఛంజనియె. రాజాశ్చర్యపడి యిట్లు చింతించెను. భగవంతునికృత్యము లత్యాశ్చర్యకరములు. మనుజులందఱికి నొక్కవిధమైన యేర్పాటుగావించక భిన్నముగానుంచుట యేలకో తెలియదు. ఈమెయు చక్కనిస్త్రీ యేగాని వేఱుకాదు. రాజమందిరమున నారాణి సర్వాభరణభూషితయై సేవకజనము అడుగులకు మడుగులొత్తుచుండ కుసుమశయ్య శయనించుచు భోగములందుచున్నది. ఇరువురును స్త్రీలే. వీరి కిట్టిభేదస్థితుల నేర్పఱచిన భగవంతుని కేమి లాభము? పరస్పరబంధములు, భేదములులేకయుండు నీకిరాతజాతి యెంతయు ప్రశంసనీయము. ఏయుపచారముగాని సాయముగాని లేకుండు నీవనిత సుఖముగా ప్రసవించి, యప్పుడే స్నానమాచరించి యెట్టిబాధయులేక వెళ్లుచున్నది. సకలోపచారము లందుచుండురాజ్ఞి యెంతయుఁ గోమలాంగియై నడుచునపుడే శ్రమ ననుభవించుచున్నది.

అని యూహించి రాజు నగరి కరుదెంచి పట్టపు దేవికిఁ గల పరిజనమునుజూచి నేటినుండి మీరెవరును రాణిగారికి పరిచర్యచేయవలదు. సకలకార్యముల నామె స్వయముగానే చేసికొనునుగాక యని యాజ్ఞాపించెను. చెలికత్తెలెవరును సమీపించి యేకార్యముచేయక తొలఁగిపోయినందులకై రాణి చింతించెను. కోమలాంగములు మృదు లతలవలె తూలు చుండ లేచి తనపనులఁ జేసికొన నారంభించెను. ఇందులకుఁ గతమేమని యాలోచించుచుండ నొకచెలికత్తె సమీపించి రాజాజ్ఞఁ దెలియఁజేసెను. మహాబుద్ధిమంతురాలైన రాణి మందస్మితవదనారవిందయై తలపంకించి యుంకించి కానిమ్ము రాజునకు బుద్ధివచ్చునట్లు చేసెదనని లేచి వెళ్లి శృంగారవన మందలి వనపాలకులం జూచి మరల నా యాజ్ఞయగునంత వఱకు మీలో నెవ్వరు నీచెట్లకు నీరుపోయుటగాని మఱియేట్టి కార్యముచేయుటగాని కూడదు. ఆజ్ఞనతిక్రమించినవారు శిర చ్ఛేదముం బొందుదురని యాజాపించెను. రాణిగారియాజ్ఞకు భయపడివారట్లొనర్చిరి.

అచిరకాలముననే శృంగారవనమందలి వృక్షములు, లతలు, నికుంజపుంజములు, అన్నియు వాడిపోయెను. పుష్ప ఫలములులేక రమ్యత చెడిపోయి యెటుచూచినను చెట్లు వాడియుంటం జూచుచున్నరాజునకు వనపాలకులు రాణి గారియాజ్ఞ నెఱింగించిరి. రాణికడకేగి "దేవీ! యిట్లేల చేసి తివి? మనోహరమగు లతాదులకు ప్రతిదినము నీరుపోసి

జాగ్రత్తగాఁ బోషింపనిచో నవి వర్ధిల్లునా? చూడుము! వానిశోభ యెంతచెడిపోయినది!" అనిరాజనెను. అందుల కామె యిట్లనెను.

దేవా! సర్వమునురక్షించువాఁడు దేవుఁడు. అడవులలోని వృక్షాదుల నే వనపాలురు నీరుపోసిపోషించెదరు? స్వయముగానే యవి రమ్యముగా వర్ధిల్లుచుండలేదా? ఈ శృంగారవనమందలి యోషధులకుమాత్ర మేల యిటువంటి వెఱ్ఱియుపచారము? కిరాతవనిత స్వయంసాహాయ్యముచే సుఖమున్నదనియు, నట్లే నేనుసహితము ప్రవర్తింపవలయునని యు భావించి నాపరిజనముం దీసివైచితివి. నా కార్యములను నేనే చేసికొనుటలో నేనెంత శ్రమపడుచున్నానో యూహింపనైతివి. శృంగారవనమందలి కుసుమలతాదు లెట్లు శోభావిహీనములైనవో యట్లే మృదువులగు నాయంగవల్లికలు శోభావిహీనములై యుంటను జూడుము. దేవుఁడు వారివారి కర్మానుసారముగా సుఖదుఃఖము లనుభవింపుఁడని యాయా సుఖదుఃఖముల కనురూపంబులగు జన్మములను ప్రసాదించి యున్నాఁడు. ఈయది బుద్ధిమంతులకందఱికి ననుభవైకవేద్యము.

అని ముద్దులొలుకుపలుకులతో రాజ్ఞి పలుకగా రాజు విస్మితుఁడయ్యెను. ఆమెయొక్కబుద్ధికి మిక్కిలి మెచ్చుకొని నిష్కారణముగా నామెకు కష్టముకలిగించినందులకై తన్ను క్షమింపుమని యామెపాదములపైఁబడెను. ఎప్పటివలెను

అంతకంటె నధికముగాను రాణిగారిని నుపచరింపుఁడని పరిజనమునకు సెలవొసంగెను. రాణియు వనపాలకులను రప్పించి యిఁక నెప్పటివలె శృంగారారామమును పోషింపుఁడని యాజ్ఞాపించెను. అప్పటినుండి రాజును రాణియు పరస్పరస్నేహాబద్ధులై చిరకాలము సుఖముగానుండిరి.



## 21. నత్తల నెఱింగిన కొంగలు.

సముద్రతీరమున నొకప్పుడు కొంగ లనేకములు పిండు కట్టి యెగురుచుండినవి. వానిలోఁ గొన్ని నీటియొడ్డునఁ గూరుచుండి తరంగములు వెలికిఁ ద్రోయు జలకీటకములను భక్షించుచుండెను. కొన్ని తరంగము లొకదానివెంబడి నొకటిగా వచ్చుటను వేడుకపడి చూచుచుండెను. మఱికొన్ని దీర్ఘకంఠములను వెనుకకుత్రిప్పి చంచువులచే పక్షములను సవరించుకొనుచుండెను. ఇంకనుగొన్ని క్రోధఘూర్ణమానమానసములై యొకదానితోనొకటి పోట్లాడుచు నొకతావునుండి మఱియొకప్రదేశమునకు నడుచుచు నెగురుచునుండినవి. అప్పుడు బహుదూరమునుండి యొకరాజహంసము సముద్రముమీఁదుగనే యెగురుచు నచటికివచ్చి వ్రాలెను. దానిం జూచి యాశ్చర్యపడి కొంగ లిట్లుప్రశ్నించినవి. తరువాత వానికిక్రిందిరీతిగా సంభాషణముజరిగెను.

కొంగలు:—కాళ్లు మొగ మెట్టునై యుండు నీ వెరవవు?

హంస:—నేను రాజహంసను.

కొం:—ఏ నివాసస్థాన మెద్ది?

హం:—అది కడుదవ్వు. మానస సరోవరము.

కొం:—అందలి విశేషము లెవ్వి?

హం:—సొగసైన స్వర్ణకమలములును ముత్యములును నమితముగా నచటఁగలవు. ఆ సరోవరమందలినీరు అమృతమయము. దానిని పానముచేసిన జరామరణాది బాధలెవ్వియుఁ గలుగవు.

కొం:—ఆ చెఱువులో నత్తలు గలవా?

హం:—నత్తలను నేనెప్పుడు చూచియుండలేదు. ఆ పేరుకూడ నే నెప్పుడు వినినవాఁడను కాను.

(అనఁగా విని యచ్చోఁగల కొంగలన్నియు పకపక నవ్వినవి.)

హం:—అయ్యలారా! ఏల నవ్వుచున్నారు?

కొం:—ఓరీ మూఢుఁడా! నత్తలనెఱుంగని జన్మము కూడ లోకమునను౦డునా? నిన్నేమందుము. నీవు మహాపాపివి. అందువలననే నీకు నత్తలను దెలిసికొనుజ్ఞానము లేకపోయెను. మమ్ము చూడుము. మేమందఱ మెంతపుణ్యాత్ములము! అందువలననే దేవుఁడు మాకు నత్తలను దయచేసియున్నాఁడు. వానిని యథేష్టముగా భక్షించి సుఖముగా కాలక్షేపముచేయుచున్నారము.

హం:—అయ్యలారా! నన్నేలనిష్కారణముగా పాపివి

అనుచున్నారు? నాకు నత్తలను దెలిసికొనుజ్ఞానము లేక పోయిన నేమి? మానససరోవరము ఎంతో పుణ్యవంతులకుఁ గాని చూచుభాగ్యమైన లభింపదు. నత్తలను దినుభాగ్యము మీకున్నది. మానససరోవరమందలి జలపానిని బంగారు చాయగల శరీరసౌందర్యమువడసియుండు పుణ్యము నా కున్నది. యోచింపఁగా మీకంటె నేనే శ్రేష్ఠుఁడననుటకుఁ దగియున్నాఁడను.

కొం:—ఛీఛీ! నోరుమూయుము. ఇఁక మాట్లాడకుము. మాటలాడిన మర్యాద దక్కదు. చంపివేయుదుము. మేము వేయిమందియున్నారము. నీవు ఒకడివి. నీవేమి చెప్పినను మే మంగీకరింపము. నీమానససరోవరము గీనససరోవరము మాకనవసరము. నత్తలు తెలిసినవారే నాగరికులు. తక్కినవారు మూఢులు. పుణ్యవంతులుకాఁగోరినవో నత్తల నెఱింగి మాదయకుఁ బాత్రులుకావలయును. అని హంసను గేలిచేయుచుఁ జంచువులతో దానినిఁ బొడుచుటకు సమీపించినవి. అంత నది భయపడి యచ్చోటువదలి స్వస్థలమునకుఁ బోయెను.

లోకమున నీ కొంగలవంటి పరమమూఢులైన జనులనేకులున్నారు. వారు సత్యమును బరికింపరు. దీర్ఘాలోచన చేయరు. తమ కేమి తెలియునో అదియొక్కటియే వారికి గొప్ప. ఎంత శ్రేష్ఠమయినదిగానుండినను ఇతరులగొప్పతనమును వారంగీకరింపరు. దేవుఁడిట్లు వారిని నిర్మించియుండగా

మన మేమిచేయుదము ? మనవల్లనగుకార్య మేది ? మఱియు పలువు రొకటిగాఁజేరి మూఢవిశ్వాసులై యైకమత్యముగా నుండగా నచ్చోట నొకనివార్త చెల్లుబడికానేరదు.



## 22. కూపస్థమండూకములు.

"లోకజ్ఞానము సంపూర్ణముగాలేనివారు కూపస్థమండూకములవంటివా"రనులోకోక్తి యెల్లెడల వ్యాపించియుండుట యందఱెఱింగినయంశము. ఈ లోకోక్తికలుగుటకుఁ గారణమేమి ? ఈక్రిందియంశమే యందులకుఁ గారణము. కూపస్థ = కూపమందలి, మండూకములు = కప్పలు అని యర్థము.

ఒకవనమున నొక పెద్దనూయియుండెను. అందలిజలము అడుగుభాగమున నుండెను. అనేకమండూకము లందుండినవి. అవి యానూతిలోనే యుత్పన్నమైనవి. ఆబావియందలినీరుదక్క మఱేదియు నవి యెఱుంగవు. అందువలన నవి యన్నియు ఆబావియే ప్రపంచమనియు అందలినీరుదక్క వేఱు జలమే లేదనియు నిశ్చయించినవి. బలహీనములై యున్న కొన్ని చిన్నకప్పలు బావియంతట తిరుగుటకుసహితము శక్తిలేక అమ్మో ! ఇది యెంతపెద్దప్రపంచము ! అని యచ్చెరువందినవి.

ఇట్లుండ వానకాలము వచ్చెను. వర్షముకురియుచుండు టచే నెచ్చటనుంచియో కొన్నిపీతలు వచ్చి యానూతిలోఁ బడినవి. అదివఱకునూతిలో పీతలే లేవు. గనుక నూతన మైన యాకారముగల వానిని దేవలోకమునుండి యీప్రపంచమునకు వచ్చినజంతువిశేషములుగా భావించి, కప్పలు వానిఁ బూజింపఁదొడంగెను. వర్షముకురియుచుండ మఱి కొన్నికప్పలుసహిత మానూతిలోఁ బ్రవేశించినవి. బావిలోని కప్పలు పీతలను బూజించుచుంటఁ జూచి యిదేమనియడిగి సంగతియెఱింగి "ఓ మూఢులారా! ఈప్రపంచ మెంతపెద్దదియో యెఱుంగని మీయజ్ఞానము నేమనిచెప్పుదుము. ఈ బావినే లోకమని నమ్మి మనకంటెను హీనవంశమునజనించిన యీపీతలను పూజించునట్టి మీమూఢత్వము నెట్లువర్ణింతుము. ఈలోకమున నిట్టినూతులును ఇంతకంటె గొప్పవగు జలాశయములును ఎన్నియోకోట్లు గలవు. అనఁగా విని యవి పీతల నుపచరించుట మానినవి. అంత వర్షజలముచే బావినిండఁగా కూపస్థమండూకములన్నియు నందుండివెలువడి ప్రపంచస్వరూపము నెఱింగి తమయజ్ఞానమును నిందించుకోఁ దొడంగెను. అప్పటికిని తక్కినజంతువులు వానిని సర్వదా కూపస్థమండూకములని పిలుచుచుండినవి.

## 23. ఖల్వాటుఁడు.

ఒకయూరిలో నొకకాపువాఁడుండెను. వానిపెద్దలందఱు మిక్కిలిగౌరవముతో వ్యవసాయముచేసికొని జీవించుచుండెడివారు. కాని యీకాపువాఁడుమాత్రము మహాదరిద్రుఁడై యుండెను. మంచియన్నము వేళకులేకపోవుటచే వాని శరీరమందలి యస్థిపంజరము బాగుగాఁ గనఁబడుచుండెను. తైలాభ్యంజనాది శరీరసంస్కారము లెంతమాత్రమును లేకపోవుటచే నతనిశిరమందలి రోమరాజియంతయు గళితమై వాఁడు ఖల్వాటుఁడై యుండెను. ప్రపంచజ్ఞానములేని భాగ్యవంతులందఱు నతని ఖల్వాటుఁడనియే పిలుచుచుండిరి.

ఒకనాఁడాఖల్వాటుఁడు "ఏమిచేయుదును? ఎట్లు నిరంతర నాఁకలిబాధ నోర్తును? ఈ యూరిలో నేనెంత శ్రమపడినను మఱిమఱి కష్టములే యధికమయ్యెడిని. కావున మఱియొకయూరి కేగినచో నొకవేళ భాగ్యముకలుగవచ్చును. కలుగవచ్చునని శంకయేల? స్థలాంతర గమన నివాసములచే నెందఱు ధనికులుకాలేదు? కావున నేనిచ్చోటువదలి యిచటికిరువదిక్రోశములదవ్వునంగల నగరముంజేరి యేదైన నొక కార్యాలయమున నియుక్తుఁడనై కాలమును సుఖముగాఁ గడపెద" నని నిశ్చయించుకొనెను.

ఆ మరునా డాయూరినుండి ప్రయాణమయ్యెను. బహు

దినములనుండి మిక్కిలిజాగ్రత్తతో సంరక్షించి తనకడనుంచు కొన్న వస్త్రయుగ్మమును ధరించుకొని అదివఱకుధరించికొని యుండిన చింపి పేలికలను దూరముగా పాఱవైచెను. అట్లు పయనమై మార్గమధ్యమునంగల యొకసత్రమున దారినడచిన బడలికలుదీర నించుకసేపు పరుండినిదురించెను. కొంచెముసేపు నిద్రవోయినతర్వాత లేచిచూడగా నితఁడుధరించియుండినవస్త్రముల నెవరో యపహరించుకొని యచట నొకపేలికనుపడవైచి పోయిరి. ఖర్వాటుఁడు మిక్కిలివ్యసనముతో నేడ్చుచుఁ దనదురదృష్టమును నిందించుకొనుచునాచింపివస్త్రమునుగట్టుకొని మరల తనయూరికి ప్రయాణమయ్యెను. దినకరకిరణాతప మధికమైయుండుటచేతను తలమీద వస్త్రముగాని రోమములుగాని లేకపోవుటచేతను ఎండబాధనోర్వక దారియందలి యొకతాళవృక్షచ్ఛాయను గూర్చుండెను. ఆ నిమిషముననే యాచెట్టునుండి యొకపెద్దతాటిపండు వీనితలమీదఁ బడెను. ఆదెబ్బకోర్వక తలపగిలి వాఁడు గతించెను.

ఈకథకే "ఖల్వాట తాళఫల న్యాయ"మని పేరు. (ఖల్వాట=బట్టతలవానియొక్కయు, తాళఫల = తాటిపండుయొక్కయు, న్యాయము=నీతి యనియర్థము.) తనసీడ తన్నే వెన్నంటివచ్చునట్లుగా దౌర్భాగ్యులెచ్చోటికేగినను వారిదురదృష్టము వారితోఁగూడనే వెళ్లుచుండును. వారుచేయుసత్కార్యములు విపరీతములయి చివరకు కష్టములే యధికమగుచుండును. (ఖల్వాటుఁడు. రూపాంతరము=ఖర్వాటుఁడు.)

మ. ధరఖర్వాటుఁడొకండు సూర్యకరసంతప్తప్రధానాంగుఁడై
త్వరతోడంబరువెత్తిచేరినిలిచెన్ దాళద్రుమచ్ఛాయఁద
చ్ఛిరముందత్ఫలపాతవేగమునవిచ్చెన్ శబ్దయోగంబుగాఁ;
బొరిదైవోపహతుండుపోవుకడకుంబోవుంగదాయాపదల్.



# 24. శాంబుఁడు.

పూర్వము శాంబుఁడనురాజొకఁడుండెను. అతఁడు ఒకనాఁడు తనభార్యతోఁగూడ వేడుకగాఁ దామరకొలనికిఁ బోయెను. అక్కడ తామరపువ్వులదాపునఁ గనుమూసి నిద్రించుచున్నరాజహంసను బట్టుకొని బిసతంతువుచే దాని కాళ్లం గట్టి యుల్లాసముగాఁ దనసహచరివదనం బవలోకించి “యిందువదనా నేను హంసను గట్టివేసితిని. దీనిఁ జూచితివా? మునివలె నున్నది. ఇఁక నిది పరుగెత్తి పోఁజాలదు. నీవు దీనిని యథేచ్ఛముగాఁ గొనిపోవచ్చునని చెప్పెను. అంత నా రాజహంస శాంబునిఁ జూచి యోరాజా నేనితామరలో నాపనిచూచుకొనుచు నొకరిజోలికిరాక పరమానందమును బొంది యుంటిని. ఇట్టి నన్నుఁ గారణములేక రాజ్యగర్వము చేత నవమానపఱిచితివి. కాఁబట్టి యీ పాపముచేత నివు నీభార్య నెడఁబాసి యాసంతాపము ననుభవింతువుగాక యని శపించెను.

అంత నాశాంబుఁడు మోము విన్నఁబోయి ప్రాణనాయికావియోగము నోర్వఁజాలక దాసి కాళ్లకట్లు విచ్చి సర్వాంగాలింగితభూతలంబుగం బ్రణమిల్లి సవినయంబుగా నే నజ్ఞానముచేతఁ జేసినపనిని క్షమింపవలయు నవి వేఁడుకొనెను. అందుమీఁద నాహంసరూపముతో నున్నసంయమికి దయ వచ్చి రాజా నీ కీశాపానుభవ మీజన్మమునందుఁ గలుగకుండ ననుగ్రహించితిని. నామాట యమోఘము గనుక భావిజన్మమున మఱియొక జన్మ మెత్తిన యీకువలయాక్షి కే యనురాగమునఁ బ్రియుఁడవై, రెండు ముహూర్తముల కాలము నా కాళ్లను గట్టి పెట్టితివి. గనుక రెండుమాసములు సంకెళ్లలోఁ దగులుకొని ప్రియావియోగము ననుభవించి పిమ్మట చిరకాలము రమణీమణితో నగణితంబగు రాజ్యసుఖమును బొందుదు వని పలికి యాదంపతులకు జన్మాంతరజ్ఞానము కలుగునట్లును వర మిచ్చెను.

కొందఱు కారణములేకయే యితరప్రాణులను పీడించెదరు. అది తగనికార్యము. "పిల్లికిచెరలాటము, ఎలుకకుఁ బ్రాణసంకటము" అన్నట్లు హింసించువారికి వేడుకగానుండును. కాని తత్ఫలమును అనుభవించువానికష్టము నిశ్వరుఁడే యెఱుంగును. ఒక్కొక్కప్పుడు; అట్టి దుష్కార్యముచే నాత్మహాని సహితముసంభవించును. కావున "జీవహింసచేయుట యకార్యము.



# 25. తెనుఁగుకవులమహిమ.

బళ్లారిమండలములో "ఆనెగొంది" యనియొకసంస్థానము గలదు. దానిని పదునైదవశతాబ్దమున సాళువగుండ నరసింహరాజు పాలించుచుండెను. ఆయన మహాబలవంతుఁడు. విద్వాంసుఁడు. కవుల ననేకులును అనయాస్థానమునఁ జేర్చి వారి నాదరించుచుండెను. వారిలో పిల్లలమర్రి పినవీరభద్రకవియనునాతఁడు సుప్రసిద్ధుఁడు. ఈయనచరిత్రము మిక్కిలి యాశ్చర్యముగా నుండును.

పినవీరభద్రునియన్న మిక్కిలి నిష్ఠాపరుఁడు. శైవభక్తిగలవాఁడు. నిరంతరము జపతపములుచేయుచు సత్కాలక్షేపముచేయుచుండును. కాని పినవీరభద్రుఁడుమాత్రమట్లుగాక బాల్యమునుండి వేశ్యాలంపటుఁడైయుండెడివాఁడు. తలిదండ్రులమాటఁగాని అన్నగారిమాటఁగాని లక్ష్యపెట్టువాఁడు కాఁడు. ఒకనాడీతఁడు వీధియరుగుపై కూర్చుండెను. అప్పుడొకఁడు మీయన్న గారేమిచేయుచున్నారనియడుగగా నీతఁడు కొంచెమైనను మర్యాదలేక మాయన్న భార్య కాభరణములు చేయించుటకయి యాలోచించుచున్నాఁడని బదులుపలికెను. ఇట్లు తమ్ముఁ డెన్నివిధములఁ దనకవమానముకలిగించినను ఆతనియన్నమాత్ర మతనియం దత్యంతప్రేమగలవాఁడై యుండెను. పినవీరభద్రుం డిట్లుండినను ఆశుధారగా కవిత్వము చెప్పుచుండెడివాఁడు. శాస్త్రవాదమున నందఱిని మించు

చుండువాఁడు. ఉభయభాషాపారంగతుఁడు. అందువలన నతఁడెన్నిపోకలుపోయినను అందఱు నతనిఁ బ్రేమించు చుండిరి.

ఒకనాఁడు రాజు జైమినిభారతమును రచింపుమని పిన వీరభద్రుని కాజ్ఞయిచ్చి పంపెను. గడువుదినమునకు ముందు దినమునఁగూడ అతఁడు గ్రంథరచనమున కారంభించక స్వేచ్ఛావిహారపరాయణుఁడై యుండెను. మితిదినమునాటికి గ్రంథమును జేసి సమర్పించనియెడల రాజుచేత మాటవచ్చు నని యన్నగారెన్నోవిధముల బోధించిరి. కాని యతని హితోపదేశము వ్యర్థమయ్యెను. అన్నమాటలు పెడచెవిఁ బెట్టి యథేష్టముగాఁ దిరుగుచుంటయు పుస్తకముముగింపవల సినదినము తేపనఁగా నేటివఱకుఁగూడ గ్రంథరచనమున కారంభించకుండుటయు నూరెల్లవ్యాపించెను. పినవీరభ ద్రుఁడు తనవిషయమై యన్నగారికిని ఇతరులకును నుండు నభిప్రాయము నెఱింగెను.

ఆనాఁటిరాత్రి పినవీరభద్రుఁడు తనగది యలికించి లోపల దీపముపెట్టి పెందలకడ భోజనముచేసి గదిలోఁ బ్రవే శించి తలుపు లోపలవేసికొనెను. అంత పదిమందిచేరి లోపల పుస్తకము వ్రాయుచున్నట్లు గంటముచప్పుడు వినఁబడుచుం డెను. అద్భుతజనకమైన యాచప్పుడువిని పినవీరభద్రుని యన్నగారు మనస్సుపట్టలేక లేచి తలుపుసందునుండి తొంగి చూచెను. అపుడు గదిలోపల సర్వాభరణభూషితురాలై

దీపము వెలుతురున శరవేగమున వ్రాయుచున్న యొక సుందర వనిత యాతనికిఁ గనఁబడెను. ఇట్లు తొంగిచూడఁగానే యామె చివాలున లేచి మాయమైపోయెను.

ఆవలకే జైమినిభారతము చాలవఱకు వ్రాయఁబడి కొన్నిపద్యములుమాత్రము వ్రాయవలసియుండెను. ఆ మిగిలినపద్యములను వ్రాసి పూర్తిచేసి పినవీరభద్రుఁడు మఱునాఁడు రాజసభకుఁ గొనిపోయెను. "నిన్నటివఱకు నీవు గ్రంథరచనమున కారంభించలేదని సుప్రసిద్ధము. ఒక్కరాత్రిలో నెట్లుముగించితి"వని రాజడిగెను. అంతట నాతఁడు "వాణి నారాణి" యనిపలికెను. కొలువులో నెవారంద ఱదిసహింపక కోపోద్దీపితులయి యాతని నిరాకరించి పలువిధముల నింగించిరి.

అప్పుడు వాణి నవరత్నఖచితములయిన కంకణములు గదల హస్తము తెరలోనుండి పైకిఁజూపి చూపి యతనిమాట సత్యము! సత్యము! అని ముమ్మాఱు పలికెను. అశరీరి సహిత మయ్యది నిక్కమని నుడివెను. సభవారంద ఱాశ్చర్యరసమగ్నమానసులైరి. తెనుఁగుకవుల మహిమ యెట్టిదో చూచితిరా. ఇట్టివా రనేకులు గలరు. అప్పటినుంచి రాజును దక్కుంగలవారును పినవీరభద్రకవికి వాణి వశ్యమనియు వరప్రసాదియనియు నెఱింగి యతని ననేకవిధంబులఁ గొనియాడుచు గౌరవించుచుండిరి. ఈయనకవిత్వము రసవంతమై ద్రాక్షాపాకమై వినువారివీనులకు విందొనరించుచు

ముద్దులుమూటఁగట్టుచుండును. జైమినిభారతము, శకుంతలాపరిణయము మొదలగు ననేకగ్రంథముల నితఁడు రచియించెను. మచ్చునకు రెండుపద్యములు.

మ. నను నేమన్నఁ గొఱంతలేదు సభలో
నం బుణ్యాచారిత్రమ
జ్జననిం దప్పఁగ నాడి తీనికృతికిన్
సైరింపఁగానేర నా
వినయం బింతకుఁదెచ్చెఁ జాలుఁబలుకు
ల్వేయేల నే క్షత్రియుం
డనో వైశ్యుండనో చూడుమంచు మగిడెన్
సంగ్రామసంరంభుఁడై.

జైమినిభారతము.

ఉ. నాపయికూర్మి తద్గురుజనంబులపై నిడి మానికన్యకా
స్థాపితవృత్తి బంధువనితాతతియందుఘటించి యిష్టస
ల్లాపములందు నిచ్చలుఁదలంపక నిచ్చలుఁ బ్రాణనాథసే
వాపరతంత్రవై యెటులువన్నియఁ దెచ్చెదో నాకుఁబుత్రికా!

శకుంతలాపరిణయము.

సమాప్తము.



Printed at the T. V. C. Press, Madras.

## చెన్నపురి:
## టి. వి. చెల్లప్పశాస్త్రి అండు సన్సు,
## 55, 56 నార్తుపిళ్ళయార్ గుడి వీధి,
## ప్రచురించిన క్రొత్తపుస్తకముల జాపితా.

| | | అ. | పై. |
|---|---|---|---|
| 1. | తెలుగు బాలశిక్ష ... | 2 | 6 |
| 2. | కార్ లేసన్ రీడరు మొదటిది ... | 3 | 0 |
| 3. | ,, రెండవది ... | 4 | 0 |
| 4. | ,, మూడవది ... | 5 | 0 |
| 5. | ,, నాల్గవది ... | 6 | 0 |
| 6. | వ్యాకరణచంద్రిక. ... | 5 | 0 |
| 7. | వ్యాసబోధిని ... | 10 | 0 |
| 8. | హిందూదేశచరిత్రము మొదటి పుస్తకము ... | 5 | 0 |
| 9. | ,, రెండవ ,, ... | 7 | 0 |
| 10. | ,, మూడవ ,, ... | 10 | 0 |
| 11. | ,, నాల్గవ ,, ... | 10 | 0 |
| 12. | భూగోళశాస్త్రము బుక్కు 1 ... | 12 | 0 |
| 13. | ,, ,, 2 ... | 12 | 0 |
| 14. | ,, ,, 3 ... | 12 | 0 |
| 15. | చెన్నరాజధాని భూగోళము ... | 7 | 0 |
| 16. | ప్రాథమికప్రకృతిశాస్త్రము బుక్కు 1 ... | 12 | 0 |
| 17. | ,, 2 ... | 12 | 0 |
| 18. | ,, 3 ... | 12 | 0 |
| 19. | ఆరోగ్యశాస్త్రము బుక్కు 1 ... | 6 | 0 |
| 20. | ,, 2 ... | 8 | 0 |
| 21. | ,, 3 ... | 8 | 0 |

